సమస్త జనుల ఉత్సాహమునకు



## ఆనందసుధ

15 రోజులకు 8 ఔ॥ రు.3-0-0

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి & సన్సు
రాజమండ్రి

బాధపడు సహోదరీ మణులకు బుద్ధిమతి



స్త్రీల ఆనందానికి

## స్త్రీసుధ

నెలకు 1 తులం రు.4-0-0

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి & సన్సు
రాజమండ్రి

అన్ని మందుల షాపులలోను లభించును




అన్ని నొప్పులకు

## అమృతాంజనము

కేసరిగారి

## శ్రీఫలాది పానకం

గర్భమునందు, నోటియందు మేహజబ్బులవల్ల, యితర కారణములవల్ల పుండగుట, చీము నెత్తురుతో మలము వెలువడుట, నీళ్ల విరేచనములను నివారించును. గ్రహిణిజబ్బులు, అతిసారము, కడుపునొప్పితోకూడిన జిగట విరేచనములను నమ్మకముగా కుదుర్చును.

కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్
మద్రాసు — 14.




వ్యవస్థాపకులు :

డాక్టరు కే. యన్. కేసరి


# గృహలక్ష్మి

విజ్ఞాన వినోద ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుటకు ఏర్పడిన స్త్రీల
సచిత్ర మాస పత్రిక


ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్ :

సి. సి. పున్నయ్య

సంపుటము 25]   నవంబరు 1956   [సంచిక 11

# వి ష య సూ చి క



## ముఖచిత్రము : శ్రీ జి. లక్ష్మణరావు



---

## ఆంధ్ర ప్రదేశ్ సంచికలు

'విజయవాణి' పత్రిక సంపాదకులు శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు. కార్యాలయము, విజయవాడ-2 వెల 0-2-0

'వాహిని' పత్రిక సంపాదకులు శ్రీ జి. ఉమామహేశ్వరరావుగారు. కార్యాలయము, విజయవాడ-2 వెల 0-4-0

గోలకొండ పత్రిక సంపాదకులు శ్రీ యన్. సర్వోత్తమ రెడ్డిగారు. కార్యాలయము చిరునామా గోల్కొండపబ్లికేషన్స్ లిమిటెడ్, హైదరాబాద్ (దక్కన్). వెల 0-4-0

'తెలుగు విద్యార్థి' సంపాదకులు శ్రీ కొల్లూరి కోటేశ్వరరావుగారు. కార్యాలయము, చిరునామా మచిలీపట్నం, కృష్ణా జిల్లా. వెల 0-4 0

'వనిత' సంపాదకురాలు శ్రీమతి అబ్బూరి ఛాయాదేవిగారు. కార్యాలయము, ఆంధ్ర యువతీ మండలి బర్కత్‌పుర, హైదరాబాద్ (దక్కన్). వెల 0-4-0

'యువకర్షక' సంపాదకులు శ్రీ దరువూరి వీరయ్యాగారు. కార్యాలయం, గుంటూరు. వెల 0-4-0

'సంస్కృతి' సంపాదకులు శ్రీ ఏ. నాగేశ్వరరావుగారు. ప్రచురణ కర్తల చిరునామా. సరస్వతి పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము. వెల 0-8-0

పై సంచికలు మా కార్యాలయమునకు చేరినవి. ఆంధ్ర ప్రదేశ్‌కు సంబంధించిన అమూల్యమైన గద్య పద్య రచనలు, ఎప్పటి శీర్షికలతో ఆకర్షణీయంగా వెలువడిన యీ సంచికలు నూతనంగా ఏర్పడిన ఆంధ్ర ప్రదేశ్‌ను గురించి తెలికోవలసిన అనేక విషయాలతోబాటు విజ్ఞాన వినోదములను వెదజల్లునవిగా నున్నవి.




జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతీమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# ఆంధ్రులు - ఆంధ్రప్రదేశ్

ముక్కోటి ఆంధ్రుల చిరకాల వాంఛితము ఆంధ్రప్రదేశ్ నిర్మాణముతో సిద్ధించినది. మూల మూలల నున్న తెలుగు భాషా ప్రాంతాలు ఒకటై ఏకోన్ముఖంగా స్వీయ పురోభివృద్ధిని తీర్చి దిద్దుకోడానికి యీనాడు అవకాశములు విస్తృతము కావడం సంతోషించతగిన విషయము.

నవభారతంలో ప్రప్రథమంగా భాషారాష్ట్ర నిర్మాణమును బలపరుస్తూ ఆంధ్రోద్యమ విజయ చిహ్నంగా నేర్పడిన ఆంధ్రరాష్ట్రము అభ్యుదయ పురోగామియై ఆంధ్రప్రదేశ్ గా విస్తరించిన సందర్భమున తెలుగు భాషా ప్రాంతాల ఏకీకరణకని సాహసోపేతంగా ఆంధ్రోద్యమమును నడిపిన నాయకులు, ఉద్యమంలో వీరోచితంగా పోరాడి, అఖండ త్యాగములుచేసిన ప్రజలు, నాయకులు చిరస్మరణీయులు. అనేకులు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము కొరకు తపిస్తూ ప్రాణము లర్పించిన త్యాగ ధనులు కనిన కలలు నేడు నిజమయినవి. ఈ సందర్భమున ఆంధ్రప్రజల శ్రేయోపురోభివృద్ధుల నుద్దేశించి నిర్విరామంగా కృషిచేసి, కష్ట నిష్టూరములను సయితం సరకు చేయక ప్రాణాలనుకూడ త్యాగంచేసిన శ్రీ పొట్టి శ్రీరాములుగారు, విజయులుగా ఈరోజున ఆంధ్రప్రదేశ్

నిర్మాణమును స్వయంగా చూచి ఆనందపరవశులగుచున్న ఆంధ్ర నాయకులు అభినందనీయులు, ఆరాధనీయులు కూడాను.

ఆంధ్ర ప్రదేశ్ నిర్మాణము తెలుగు ప్రజలయొక్క శాంతి సౌభాగ్యముల నుద్దేశించినది. తమ రాష్ట్రంతోబాటు హృదయాలు సయితం విశాలమై ఉన్న అవకాశములను సద్వినియోగం చేసికోవలసినవారు ఆంధ్ర ప్రజలు. అభివృద్ధి ప్రణాళికల నిర్వహణకుగాని, ప్రజాహితాన్ని శరవేగంగా ప్రోత్సహించే సంస్కరణల నమలుపరచుటకుగాని బలీయమైన జాతీయ నాయకత్వము అత్యవసరము. బలీయమైన జాతీయ నాయకత్వ నిర్మాణమునకుగాను ప్రజలు చిత్తశుద్ధితో బాధ్యతలను అవకాశములను గుర్తించి రాష్ట్రశ్రేయస్సును జాతీయ శ్రేయస్సును సమరస సమైక్యతలతో పెంపొందింప చేయవలసి యున్నది.

ఆంధ్ర ప్రదేశ్ కు మహోజ్జ్వల భవిష్యత్తు గలదని ఆశిద్దాం! గతంలో ఎన్నో తెలుగు రాజ్యాలు వెలసినా, ఎందరో రాజులు, రారాజులు పరాక్రమ సంపన్నులుగా, కీర్తి ప్రతిష్ఠలతో పరిపాలించినా ఏక ఖండంగా స్థిరమైన పరిపాలనలో ఆంధ్రదేశ ముండినది లేదు. ఈనాడు విశాలమై ఏక ఖండమైన ఆంధ్ర ప్రదేశ్ స్వపరిపాలనలో, సుపరిపాలనను రూపొందించుకొని ప్రజాహితాన్ని ప్రోత్సహించ గలదని ఆశిద్దాము!

ఇప్పటికీ మద్రాసు, ఒరిస్సా, మైసూరు రాష్ట్రాలలోని తెలుగు ప్రాంతాలు, అచ్చటి ప్రజలు తమ సోదరాంధ్ర ప్రజానీకము నుండి ఏర్పడిన యడబాటుకు చింతించుచుండుట ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, ప్రజలు గుర్తించవలసినది. రాష్ట్రేతరాంధ్రుల విద్యా సాంస్కృతిక పురోభివృద్ధిపట్ల ఆంధ్ర ప్రదేశ్ యికముందు కూడ ఆసక్తి చూపి అవకాశ మున్నప్పుడల్లా సహాయము చేయుచుండవలెను.

ఆంధ్ర ప్రదేశ్ తొలి గవర్నరు శ్రీ చందూలాల్ త్రివేదిగారు, తొలి ముఖ్య మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు రాష్ట్రీయ సమస్యలను వాస్తవికత కనుగుణ్యంగా పరిష్కరించడములోను, శాంతి, సౌభాగ్య, అభ్యుదయములను పెంపుజేయుటలోను ప్రజలసానుభూతి, సహకార సహాయములను విశేషముగా సేకరించగలరు. శ్రీ సంజీవ రెడ్డిగారి మంత్రివర్గం సామాన్య ప్రజల శ్రేయస్సు నుద్దేశించి ప్రజానురంజకమైన ప్రభుత్వ విధానాలను రూపొందించగలరని మా విశ్వాసం! ఆంధ్ర ప్రదేశ్ మంత్రివర్గంలో మహిళా ప్రతినిధి లేకపోవడం కొరతగానున్నది. నియమితులు కానున్న మంత్రిపదవులలోకాని, లేదా ఉపమంత్రిపదవులలోకాని మహిళలకు సముచిత స్థానము లభించగలదనే ఆశిస్తున్నాము.

# బిడ్డలు - తల్లిదండ్రులు

## కుటుంబములో బిడ్డకుగల స్థానము

శ్రీ కె. వెంకట్రామయ్య

**మొదటిబిడ్డ**:- రెండవబిడ్డ జన్మించినంతనే మొదటిబిడ్డకు కోపమును, ఈర్ష్యభావమును కలుగును. అందుచే నతడింటగల పెద్దపిన్నలతో కలహింప జొచ్చును. ఒక్కొక్కప్పుడీ వైరవృత్తినతడు కుటుంబమందలి వ్యక్తులందరియెడజూపక తల్లియెడలనో క్రొత్తగా పుట్టినబిడ్డయెడలనో జూపుచుండును. రెండవ బిడ్డ తనకన్న నెక్కువయందమును, తెలివిని గలిగియున్నను, సులభముగా స్నేహితులను బడయుచున్నను మొదటిబిడ్డ కతనిపైగల ఈర్ష్యభావ మెన్నటికిని నశింపకుండును. ఈ యీర్ష్యభావముచే నతడితర వ్యక్తులయెడలను జూపనారంభించును.

ఒక్కొక్కప్పుడు మొదటిబిడ్డ దన్యాయముగ నేని కొన్ని ప్రత్యేక హక్కులను గోరుచుండును. తల్లిదండ్రులును, అతని యర్హతను విచారింపక, పెద్దబిడ్డను భావముతో ప్రత్యేకావకాశముల నిచ్చుచుందురు. బిడ్డ యర్హతను పాటింపక అతని కధికారమిచ్చుట, అతని కపకారముచేయుటయేయగును.

కొన్ని కుటుంబములలో మొదటిబిడ్డకెక్కుడో బాధ్యత పైబడుచుండును. ఇదియు నన్యాయమే. కారణమేమన అతడు పిన్నవయసుననే పెద్దవానివలె మెలగుచు తోడిబిడ్డలతో కలియజాలకుండును. బాధ్యత పై బడుటచే కొందరుబిడ్డ లతివిధేయులై వ్యక్తిత్వమును, వికాసమును జూపకుందురు. మరికొందరు ఇతరులపై నధికారముజూపుచు వారిని నిర్వహింప జూతురు. కాని మరికొందరు బిడ్డలు తమకుగల సహజ శక్తిని, శాంతమును, సానుభూతిని జూపుచు కుటుంబమువారికందరకును స్నేహితులుగను, సలహాదారులుగను వ్యవహరించుచుందురు.

**కడపటిబిడ్డ**:- ముద్దు, గారాబములచే పాడగుచుండును. పసివాడని ప్రత్యేకతజూపుచు ఖండితముగనుండకుండుటచే నతడితరులు తనమాట ప్రకారము నడచుకొనవలెనని తలంచుచు, ఆదుపాజ్ఞలకు లోబడక, అహంకారమును, స్వార్థమును జూపుచుండును. లేదా, కడపటివాడని ముద్దుజేయుచు ఎక్కువగా సంరక్షించుచుండుటచే నతడెదిగియు పసివానివలె నిస్సహాయతజూపుచు జీవితమందలి సామాన్య స్వల్ప విషయములకుగూడ నితరులపై నాధారపడుచుండును.

**నడిమిబిడ్డ** (Middle Child):- స్థితి చాల క్లిష్టమైయుండును. మొదటిబిడ్డ స్థాన మతనికెన్నడును లేదు. కడపటివాడగుటయు మరియొకబిడ్డ పుట్టువరకేయగును. సాధారణముగ తల్లిదండ్రులలో నొకరికి పెద్దవానిపై నెక్కువ యిష్టముండును. మరియొకరికి కడపటివాడన్న నెక్కువయిష్టముండును. మధ్యమునిపై నెవరికిని అంత యిష్టముండదు. దీనికి తోడు ఆ యిద్దరు బిడ్డలలో మొదటి, కడపటి బిడ్డలలో నెవరైనను నెక్కువ సమర్థతను, విశిష్టతను జూపుచుండిరేని మధ్యముడు మరింత తక్కువభావమును బొందుచు బాధపడుచుండును. అతడు సున్నిత స్వభావుడును, యోచనపరుడును అయినచో నావిధమున బాధపడుట మరింత హెచ్చుగా నుండును. దానివలన అతడొక్కొక్కప్పుడు అంతర్మనస్కుడై ఎవరిని చేరక "తానే లోకము"గ చరించుచుండును. మరికొన్ని సమయములలో నతడితరులపై నధికారము జూపుచు వారిని తన వశముజేసికొనగోరుచుండును. బిడ్డడీవిధముగ చరించుట తన భయమును, "భద్రత లేమి" భావమును, ఇతరులకును, తనకునుగూడ తెలియకుండజేయుటకేయగును. ఇట్టి ప్రయత్నములచే నతని కేర్పడెడి మానసిక ప్రవృత్తుల ప్రభావము అతని భావి జీవితమున నెక్కువగా ప్రకటితమగుచుండును.

**ఆడుబిడ్డలలో మగబిడ్డకు**:- ఆడంగి తన మబ్బ

గలడు. లేదా ఆడువారిపై నధికారముజూపుట యలవడగలదు. ఇంట తన్నెక్కువగా జూచెడి వారాడువారేయగుటనుబట్టి వారియెడ నతనికొక తక్కువభావము జనించును. మగవారిసేవకే స్త్రీ లున్నారని అతడు తలంచును. ఇట్టి యభిప్రాయము స్త్రీలయెడ నేర్పడుటచే అతనిభావి జీవితమంతయు బాధాకరముగ పరిణమించును. కారణమేమన అందరు స్త్రీలును అతని యాజ్ఞల ననుసరింప బోరు-అతనికొదిగియు నుండబోరు. అందుచే నతనికి కుటుంబశాంతియు గృహసౌఖ్యము నుండజాలవు.

**మగబిడ్డలలో నాడుబిడ్డ:**-తన యన్నదమ్ములకు స్నేహితురాలై యింటలో సంతోషముగ నుండవచ్చును. వారి సహవాసముచే ఇతర స్త్రీలకు తెలియని విషయముల నెన్నిటినో నేర్చుకొనవచ్చును. స్త్రీయైయుండియు పౌరుషగుణముల నలవరచుకొనవచ్చును. కాని తానాడుది యగుటయే కళంకముగా దలంచెడిబిడ్డ పరిస్థితి చాల వేరైయుండును. అట్టి బిడ్డ తక్కువదానవను తలంపుతో వేదనపడుచు దానినే, వివిధరీతుల విశదముజేయుచుండును. పురుషులతోను, పిల్లవాండ్రతోను సరిగానుండక బిడియము జూపును. లేదా తన స్త్రీత్వము నూతగొని పురుషులను వశముజేసికొన జూచుచుండును. మగవారికన్న తానేల తక్కువకావలెననెడి భావముతో వారి నడతలను, వేషభాషలను అనుకరింపగలదు. ఇట్టి స్వభావముచే నామె తరచుగ కొన్ని గొప్ప గుణములనుగూడ నలవరచుకొనుచు బాధ్యతాధికారములతో కూడిన యున్నతస్థానముల నలంకరింప సమర్థురాలగుచుండును.

బిడ్డల మనోభావము లెట్టి విచిత్రమగు మార్పుల నొందుచుండునో, వారి మానసిక ప్రవృత్తు లెట్లేర్పడుచుండునో చూచాయగ తెలిసికొంటిమి. ఇక వారి సాంఘిక పరిణామ మేదశలయందెట్లుండునదియును విచారింతము.

**బిడ్డ సాంఘిక పరిణామమందలి దశలు:-**
**(The Stages of the Child's Social Development)**

బిడ్డ మొదట తనయందే దృష్టినిగలిగి "తానే లోకము"గ నుండుననియు, ఇక ఎదిగినకొలదియు నింటగలవారియెడలను, తదుపరి బయటివారియెడలను, క్రమముగ తన కుతూహలమును జూపుచుండుననియు ఇంతకుముందే తెలిసికొంటిమి.

శైశవమున బిడ్డకు తల్లి సాంగత్య మవసరమగును. ఆటసమయములందామె తన బిడ్డను ఒంటరిగా వదలరాదు. దగ్గరనుండి యతని నాడించవలెను. అట్లగుటచే నతడితరులతో కలసియుండి యానందము నొందుట మొదటినుండియు నలవరచుకొనగలడు. శైశవమున బిడ్డ స్వంతముగా నాడుకొనజాలడు. కనుక తల్లి యతని నాడించవలసియుండును. కాని ఆ యాడించుటయు నెక్కువకారాదు. ఎక్కువైనచో బిడ్డ స్వతంత్రముగా నాడుకొనక తన యానందముకొర కితరులపై నాధారపడుచుండును. 1-2 సం॥లోపు వయస్సుగలబిడ్డ ఇతరపిల్లలతో నాడినను ఆడకున్నను వారి సాంగత్యమును గోరుచుండును. వారి నతడు కొట్టవచ్చును. వారితో కలహింపవచ్చును. అవి యంతగా పాటింపవలసిన విషయములుగావు. ఆరంభమున నతడట్లే తన సాంఘిక సంబంధముల నేర్పరచుకొనుచుండును. శిశుదశలో బిడ్డజూపెడి మనోవేగములెంతయు సహజములై యహంకారమును జూపుచుండును. ఇష్టమగుదానినెల్ల పొందవలెననియు, పట్టుకొనవలెననియు, తన వశముజేసికొనవలెననియు, నతడు ప్రయత్నించునేగాని దానివలన గలిగెడి బాధల నూహింపజాలడు. కాని అనుభవములు కలుగుకొలది తన మనోవేగముల నదుపున నుంచుకొనుట యవసరమని యతడు గ్రహింపగలడు. ఇది యతని కితరపిల్లల సహవాసమువలననే సాధారణముగ తెలియుచుండును. బిడ్డ తనతోటి పిల్లలచేరక ఒంటిగా నుండుటకంటె వారితో కలహించుటయే మేలగును.

ఇతర పిల్లల సాంగత్యము నభిలషించుట బిడ్డకు సహజమగును. అట్టి కోరిక నతడు జూపకున్న అతని స్వభావమునందో, పరిసరములందో లోపములుండగలవు. ఆ లోపముల పరిశీలించి తొలగింప ప్రయత్నించవలెను.

మూడేండ్ల వయస్సురాగానే బిడ్డకు సమవయస్కులగు నితరపిల్లల సహవాస మవసరమగును. 2-3 సం|| వయస్సుగల బిడ్డ యొంటరిగా నుండజాలడు. అతనికి తగిన జతగాడుండవలెను. అట్టి జతగాని నతనికి చేకూర్చనిచో అతడిల్లువదలి తన స్నేహమునకై వెదుకనారంభించును. బిడ్డకు తగిన జతగానిని చేకూర్పజాలనపుడు అతనినే కిండర్‌గార్డెన్ బడికో, నర్సరీ బడికో పంపవలెను. అదియు సాధ్యపడనపుడు అతని వయస్సునకు తగియుండెడి యాటసామానుల నాలోచించి సమకూర్చవలెను.

కొందరు చిన్న పిల్లలు తల్లినే అంటియుండి తోటి పిల్లల సహవాసము నరయకుందురు. ఇది వారికి చెరుపగుటయేగాక తల్లికి తీరనిబాధగా పరిణమించును. పిల్లలలో నీ విధముగ నుండువారు తరచుగ నలుకజెందుచు, చిరచిరలాడుచు, వస్తువులను నాశముజేయు గుణమును జూపుచుందురు.

2½-3 సం|| వయస్సుబిడ్డ, గుంపులోచేరి యాడుటచే నెక్కువ యానందము నొందజాలడు. అయినను అతడింకొక బిడ్డతోగూడి కులసాగా నాడుకొనగలడు. బిడ్డలిద్దరుచేరినపుడు ఒకరినొకరు బండ్లలోనుంచి లాగుకొనుచు, పోటీగా పరుగిడుచు ఆడుకొనుచుండగలరు. అట్టియెడ వారికి గెలుపోటములకన్న ఆడుటయే ముఖ్యమగును. పరుగెత్తుట, బంతుల నొకరికొకరు వేసికొనుట, కర్రఘనములతోగాని, ఇతర విధములగాని కట్టుట ఇత్యాదికార్యములలో నీ వయసుబిడ్డల నెక్కువగా పాల్గొనజేయునది, కలసియుండవలెననెడి తలంపే కాని, కలసియాడుకొనవలెననెడి కోరికగాదు. ఒకే విధమగు పనిని ఒకే సమయమున చేయుటయే వారి కాటయగుచుండును. కాని దానియందెట్టి యేర్పాటును, ఉద్దేశ్యమును నుండబోవు.

3½-4సం|| లోపు వయసు బిడ్డలు ఒక విధముగ నేర్పాటైన యాటలనే ఆడుచుందురు. అందరుచేరి ఒక ఇంటినో, పడవనో, కారు షెడ్డునో కట్టుచు ఆయా పనులకు తగిన "పాత్ర"లనేవో స్వీకరించుచుందురు. కాని వారి యాటలలో నటనా ప్రదర్శనమంతగా నుండదు. ఐనను వారీ విధమున కలసియాడెడి యాటయే క్రమ క్రమముగ పెంపొందుచు జట్టుగా నేర్పడి (Team) యాడు ఆటగా పరిణమించును. బిడ్డలయాట ఇట్టి పరిణామము నొందునపుడు వారి సహకారగుణమును క్రమముగ పెంపొందవలెను. వారు కేవలము తమ సంగతినే జూచుకొనక జట్టులో (Team) తామొకరని తెలిసికొని దాని మేలునకై తమ స్వార్థమును త్యజింప సిద్ధముగానుండవలెను. 7-10 యేండ్ల వయస్సు బిడ్డలు గుంపుగజేరి యాడునపుడు వారిని గమనించితిమేని వ్యక్తిగతమగు వేరు బుద్ధికిని, సాంఘిక బుద్ధికిని ఎట్టి పోరాటము గలుగుచుండునదియు బోధపడగలదు. విచిత్రమేమన ఆ బిడ్డలు వారి వారి పక్షముల నెన్నుకొన్నంతనే యాట యాడుటకు బదులు ఎవరికివారే మొదట యాడవలెనని ప్రయత్నించుచు సగము కాలము వాదనలందును, కలహములందును గడుపుచుందురు.

### అగుపడని స్నేహము (The Invisible Playmate):

ఒంటి బిడ్డ ఒక్కొక్కప్పుడు అగుపడని స్నేహము నొకని నూహించుకొని యాడుకొనుచుండును. ఇట్లతడూహించుకొని యాడుకొలది, ఆ చెలికాడెవడో తన యెదుట నిజముగా నున్నట్లే అతనికి తోచుచుండును. ఈ విధముగ భావించుచు బిడ్డ యాడుకొనుట తలిదండ్రుల కాందోళన కలిగింపగలదు. కాని ఇది యాందోళన పడవలసిన విషయముగాదు. తోడి పిల్లల సహవాస మవసరమై ఆ బిడ్డడావిధముగ నాడుచు సంతృప్తి నొందునేగాని తగిన జతగాడున్నను

లేదా, బడికి బోయినను ఆ మిథ్యామైత్రి మాయమగును.

**బిడ్డను సాంఘిక జీవనమునకు సరిచేయుట** (Socializing the child)

పదేండ్లు దాటిన బిడ్డలు అసాంఘిక ప్రవృత్తుల జూపుచోడ (unsocial attitudes) నేమి చేయవలెను? ఇంటియందును బడియందును ఏర్పడిన పరిసర దోషములను సవరించుచూ సరియగు నడత నలవరచెడి సాంఘిక శిక్షణవారి కెట్లీయనగును?— ఈ విషయములనుగూర్చియు నిట నాలోచింపవలెను.

బిడ్డలు వారి మనోవేగములను సక్రమరీతిని వెలిబుచ్చుచుండవలెను. అందులకు తగిన యవకాశముల నిచ్చుట మన మొదటి పని.

సాంఘిక శిక్షణ నొసగుటలో బాల భట సంఘములవంటి సంస్థల కృషి ఎన్నదగియున్నది. అందు చేరిన పిల్లలు తమ తమ పనులను నిర్వర్తించుటయే గాక సంఘ సమ్మత ప్రవర్తనా నియమములను గూడ పాటింపవలసి యుండును. వాని నతిక్రమించినవారు సంఘముయొక్క యసమ్మతికి గురియగుచుందురు. ఇది బిడ్డల కెంతయు సరిచేయగలదు. బిడ్డలు తమతోటి పిల్లలమాట ననుసరించి ప్రవర్తింప నిష్టపడుదురు. పెద్దవారిమాట నతిక్రమించుచుందురు. కారణమేమన తోటి వారు చెప్పినది అభిప్రాయముగనే తోచును. పెద్దలు నుడివిన దాజ్ఞగా నుండును. అల్లరి జట్టునకు నాయకుడగు బిడ్డ నిజముగా మూర్తిత్వంగల వ్యక్తియే ఐయుండును. అట్టివానియెడ నమ్మిక జూపుచు ఆ జట్టు ప్రవర్తన కతనిని బాధ్యుని జేసిన అద్భుత ఫలితములను జూపగలదు. ఈ విషయము తరచుగ నిరూపింపబడుచునే యుండును. అదపున నుండని బిడ్డ (Lawless child) ఎదిరించెడి బిడ్డ (Resistant child) అపరాధియగు బిడ్డ (Delinquent) మూర్తిత్వముగల వ్యక్తులేగాని చెడ్డవారు గారు. నిర్వహణ లోపములచే వారట్లు తయారగుదురు. వారి మనోభావములు కలతజెంది యుండును. లేదా అణగి యుండును. ఎక్కువ గారాబము వలననో, ఎక్కువ శిక్షణ వలననో వారు పాడై యుండవచ్చును. అట్టియెడ తమ భావోద్రేకములను వెలిబుచ్చుచు వానిని తమ యదపున నుంచుకొనుటకు తగిన యవకాశములను వారికీయవలెను.

సరియగు సాంఘిక ప్రవృత్తుల నేర్పరచుకొనుటకు తగిన యనుభవములను కలుగజేయవలెను.

శాంతియు, పరస్పరసానుభూతియు అన్యోన్య సహకారమును గల కుటుంబమున పెరిగెడి బిడ్డ మొదటి నుండియు సరియగు సాంఘిక శిక్షణమును బొందుచునే యుండును. అట్టి బిడ్డ కేర్పడెడి మనోభావము లెంతయు సరియై యుండును.

---

ఆంధ్రప్రదేశ్ కు శ్రీమతి కుసుం త్రివేది అధ్యక్షురాలుగా స్త్రీలపొదుపు ఉద్యమం సలహా సంఘం ఏర్పాటుచేయబడింది. దీనిలో ఆంధ్రయువతీ మండలి కార్యదర్శిని శ్రీమతి వై. శ్యామలా దేవి, శ్రీమతి యస్. జ్యూరీ, శ్రీమతి రత్నాబాయి, శ్రీమతి డి. యస్. జాన్, శ్రీమతి బి. కమలాదేవిగారలు సంఘ సభ్యులుగా నుందురు.

* * *

ఇతియోపియాచక్రవర్తి హెయిలీసెలాసీ న్యూఢిల్లీలో పత్రికా ప్రతినిధులతో మాట్లాడుచు "ఎట్టి అంతర్జాతీయ పరిస్థితినైనా ఎదుర్కొనే సత్తా మిత్రరాజ్యసమితికి వుంటేనే అది శాంతిరక్షణభారాన్ని నిర్వహించగలదు; అట్టి బలం లేనందుననే సమిష్టిభద్రత ఈ జిప్టు విషయంలో జయప్రదంగా అమలుపరచబడలేదు" అని అన్నారు.

శ్రీ

# జై! విశాలాంధ్ర జననీ! పరమపావనీ!

# "ఆంధ్రప్రదేశ్" అవతరణ మహోత్సవము

**(1-11-1956)**

## స్వాగత పంచరత్నములు

శ్రీ కల్లూరి అహోబలరావు

---

శ్రీ కాకుళము మొదల్ । జేసి, విశాఖపట్న మనంతపుర మొండు నాణ్యమైన
గోదావరులు రెండు-మోద్ధంబుగా కృష్ణ కర్నూలు గుంటూరు కడపయొండు
నెల్లూరు, చిత్తూరు-నల్లగొండయు, కరీంనగరంబు, మహబూబు నగర మొండు
ఆదిలాబాదొండు-హైదరాబాదులు రెండు, ఖమ్మమొరంగలొండు వెలయు
శ్రీ నిజామాబాదు । సికిందరాబాదు మెదకుమండల మొండు-ముదముగాఁ

గల్గు నిరువదిరెండు విఖ్యాతమైన మండలంబులతోఁ బైడికుండ కరణి
శ్రీ విశాలాంధ్ర జనని! వచ్చితివినీవు! స్వాగతం బందుకొనుమ! సుస్వాగతంబు!
వైశాల్యమా లక్ష పదుమూడువేల్నూటపది, చదరపుమైళ్ళ పరిమితంబు
వాహినులా-తుంగభద్ర గోదావరీ కృష్ణపెన్నల పరీవృతము సతము
పంటలా-యిరుగారు పండెడి నవధాన్య వితతులరాసులు వేనవేలు
పాడియా-యమృతప్రవాహమై, మధురమై, కొలఁది మీఱు నొసంగు గోగణంబు

జనములా! మూడుకోట్లపై సంఖ్య భళిరె! విద్యయా! షష్ఠిపై నాల్గువిద్యలందు
బుధవతంసులు తల్లి నీ పుత్రవరులు! మేలి శ్రీ విశాలాంధ్ర లక్ష్మీలలామ!
చైతన్య రహితులౌ సర్వమానవులకు జీవనౌషధము సంజీవరెడ్డి
బహుళార్థసాధక ప్రాజెక్టులకు, మూల జీవగఱ్ఱగద! సంజీవరెడ్డి
వాక్చమత్కృతి-ప్రియభాషణంబు, మితోక్తి స్థిరముగాఁగల్గు సంజీవరెడ్డి
ఘనకార్యములనెల్లఁగడుదీక్షఁదీర్చు మేధావి-యువకుఁడు సంజీవరెడ్డి

దొడ్డబిడ్డడు సంజీవరెడ్డి; దిశలు సుప్రభలు వెల్లవచ్చె యాంధ్రప్రదేశ
రథము దోలంగ, మేటిసారథిగ నేడు హారతులబట్టి దీవింపు డాంధ్రులార!
వైద్యసహాయంబు-విద్యాభివృద్ధియుఁ బెంపుగఁ సతముగావింపవలయు
ఆర్థిక స్తోమత నమరించి యాంధ్రపండితులను, కవుల మన్నింపవలయు

వ్యవసాయ వసతుల-సవరించియును, పరిశ్రమపను లభివృద్ధి సలుపవలయు
బడిపంతు లిడుమలఁబడకుండ జీతమెచ్చించియు వారి మెప్పించవలయు
అల తెలంగాణ ప్రజనుత్తరాదివారిఁ జిన్నబోయిన రాయలసీమవారి
నొక్క తెఱఁగున మన్నించి యోజఁ బెంచి స్థిరయశస్సు నార్జింపు-సంజీవరెడ్డి!
నెహ్రూజీ, ఢేబరు నీకండ నున్నారు శ్రీ త్రివేదియుఁ గటాక్షించినాఁడు
పదునైదుమంత్రుల బలగంబు నీకుండు వారి మేధాశక్తి ప్రబలియుండు
కవుల యాశీర్వాద కల్మినీకండయై నిను సత్పథమున మన్నించుచుండు
అల విశాలాంధ్ర రాజ్యరమణియే నీకు చేఁదోడుగాఁగ-రక్షించుచుండు
దుర్ముఖి, ఆశ్వయుజ, బ॥ చతుర్దశిదినమందు, మకరాంశలగ్న మానందకరము
విజయ సామ్రాజ్యలక్ష్మి స్థాపించి గొనుము! శ్రీకరంబైన కీర్తి సంజీవరెడ్డి!

॥ ఓం! శాంతి శ్శాంతిః ॥

---

## అంధులకొరకు "చదివే యంత్రం"

దాదాపు ఒక శతాబ్దానికిపైగా అంధులు బ్రెయిల్లీ పద్ధతిద్వారా చదువుకొంటూవచ్చారు. బ్రెయిల్లీ అన్నతడు యీ పద్ధతిని కనిపెట్టడంవల్ల దానికాపేరు వచ్చింది. ఉబ్బెత్తుగాఉండే చిన్న చిన్న చుక్కలతో యీ వ్రాత వ్రాయబడి ఉంటుంది.

అయినప్పటికి బ్రెయిల్లీ పద్ధతిలో ఒక పెద్ద లోటు ఉన్నది. ఈ పద్ధతిలో వ్రాయబడ్డ గ్రంథాలు ప్రమాణంలో పెద్దవిగా తయారవుతాయి.

సాధారణమైన పుస్తకాలను, మేగజైన్లను, వార్తాపత్రికలను అంధులు చదువగలిగేటట్లు చేయగల ఒక యంత్రాన్ని కనిపెట్టడానికి చాలాకాలంబట్టి విజ్ఞానశాస్త్రవేత్తలు ప్రయత్నాలుచేస్తూ వచ్చారు. ప్రొఫెసర్ ఐవన్ సొకొల్యన్స్కీ తయారుచేసిన "చదివే యంత్రం" నమూనా ఒకటి ఒక విజ్ఞానశాస్త్ర పరిశోధనాలయంలో 1952లో మొట్టమొదటిసారిగా పరిశీలింపబడింది. దానియొక్క "విద్యుత్ నయనం" అంధులను తాము చూడలేనట్టి అక్షరాలను స్ఫురణద్వారా తెలుసుకొనేట్లు చేస్తుంది. గతనాలుగు సంవత్సరాలకాలంలో దీనిలో ఇంకా చక్కని మార్పులు చేయబడ్డాయి.

విద్యుచ్ఛక్తి రూపాంతరీకరణ సూత్రం ప్రాతిపదికమీద ఈ యంత్రం నిర్మింపబడింది. ఫోటోసెల్స్ పైన ప్రతిబింబింపబడిన అక్షరంయొక్క ప్రతిబింబం విద్యుచ్ఛక్తి సంజ్ఞగా రూపాంతరీకరణ గావింపబడి, తర్వాత రిలేబ్లాకుపై ప్రసారంచేయబడుతుంది. ఇక్కడ ఆ సంజ్ఞ ఒక విధమైన విద్యుత్ తాకిడిగా రూపాంతరీకరణంపొంది "పాఠకుని" వ్రేళ్లకు స్పర్శాఫలకంమీది అయిదు రంధ్రాలద్వారా స్ఫురిస్తుంది.

ఈ యంత్రంగాక, ప్రతి అక్షరము కొన్ని ధ్వనుల మేళవింపుద్వారా వ్యక్తంగావింపబడే ఒక శబ్ద యంత్రంకూడా ఉన్నది.

ప్రస్తుతం సోవియట్ దేశ ఉపాధ్యాయ శిక్షణాశాస్త్ర పరిషత్తుకుచెందిన "డిఫెక్టొలజీ" విద్యాసంస్థ యొక్క ప్రత్యేక పరిశోధనాలయంపై రెండు యంత్రాల సంతృప్తికరమైన నమూనాలను తయారుచేస్తున్నది. ఈ రెండు యంత్రాలద్వారా చదవను నేర్చుకొనడం చాలా సులభంగా ఉంటుంది. 30 గంటలలో చదువను నేర్చుకొనవచ్చును.

అంధుల జీవితంలో నిజంగా విప్లవాన్ని తీసుకొనిరాగల యీ రెండు "చదివేయంత్రాలు" త్వరలోనే పెద్దపెట్టున ఉత్పత్తిచేయబడుతాయి.

'టాస్'

పురోభివృద్ధికొరకు ప్రణాళిక




...లను తరువాతి ఐదు సం॥లలో - (1956 - 61) నవభారత నిర్మాణ మహత్కార్య సాధన కొరకు ఖర్చుపెట్టనున్నారు. ఈ మొత్తము ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఖర్చులకై వినియోగించిన 2,356 కోట్ల రూపాయల మొత్తమునకు రెట్టింపుకంటె అధికమైనది.

ప్రథమ ప్రణాళికలో ప్రాధాన్యం యివ్వబడ్డవి :

(1) వ్యవసాయము (2) నీటి పారుదల మరియు విద్యుచ్ఛక్తి (3) సాంఘిక సేవ.

రెండవ ప్రణాళికలో ప్రధానమైనవి :

(1) పరిశ్రమలు—అందులోనూ ప్రత్యేకముగా పెద్ద పరిశ్రమలు (2) రహదారి మరియు సమాచార సౌకర్యాలు (3) ఇతోధిక సాంఘిక సేవ.

ఖర్చుల పంపకం:

(కోట్ల రూపాయలలో)

| | ప్రథమ ప్రణాళిక | ద్వితీయ ప్రణాళిక |
|---|---|---|
| వ్యవసాయం మరియు సామూహిక విస్తరణ కార్యక్రమాలు ... | 357 | 568 |
| నీటి పారుదల సౌకర్యాలు మరియు విద్యుచ్ఛక్తి ... | 661 | 913 |
| పరిశ్రమలు మరియు లోహసంపద | 179 | 890 |
| రహదారీ మరియు సమాచార సౌకర్యాలు ... | 557 | 1,385 |
| సాంఘిక సేవ, గృహనిర్మాణం మరియు పునరావాస కార్యక్రమాలు | 533 | 945 |
| చిల్లర ఖర్చులు ... | 69 | 99 |
| | 2,356 | 4,800 |



"ఆఖరుమాటగా చెప్పవలెనంటే - ప్రణాళిక అనగా చేతినిండా పని. ప్రణాళిక అనగా సువ్యవస్థితమూ, సమాలోచితమూ అయిన పరిశ్రమ మరియు రాష్ట్రము నందలి సమష్టి సంపదయొక్క సద్వినియోగము. ఇందులో ప్రధానమైనది జనబలము. దీనినంతా సమష్టి ప్రజానీకానికి అత్యంతంగా అనుకూలించులాగ, మరియు ప్రజానీకముయొక్క సమష్టి లాభంకొరకు సద్వినియోగపరచనగును."

—జవాహరలాల్ నెహరు.

# ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

రాష్ట్ర పురోభివృద్ధికొరకు

DA-56/101

# మనసొల్లని మొగుడు లేక నీవేమంటావు??

శ్రీ బచ్చల మునికన్నయ్య

(గతసంచిక తరువాయి)

## 3

పరీక్ష ఫలితాల అనంతరం ఉపాధ్యాయ అభ్యసన పాఠశాలలో చేరాను. ఒక సంవత్సరం... (మూడు వందల అరవై ఐదు రోజులు) మూడు క్షణాలుగా మాయ మయ్యింది. సెలవుల్లో ఎందుకోమరి నాకే తెలియదు దిగువ పల్లెకు పోయ్యాను. రామన్న ఇంటిలో మకాం. రామన్న జరిగిన కథంతా పూస గ్రుచ్చినట్లు చెప్పాడు... కాని ప్రయోజనమేమి? గత జల సేతుబంధనము! నారాక పసిపట్టింది రామ లక్ష్మి. రామన్న యింటికి వచ్చింది. నేను చూడలేక పొయ్యాను. లేచి ప్రక్కింటికి వెళ్ళాను. పాపం! పిచ్చి పిల్ల ఏడ్చింది నిలబడి. నిరాశతో యింటికి పోయింది. ప్రక్కింటిలో నున్న నేను, రామలక్ష్మి పోకను గ్రహించి మళ్లా రామన్న యింటికి వచ్చాను... మా అవ్వ "ఏమిరా! అలా ఆ పిల్ల వస్తే లేచి వెళ్ళావు?"

"అవ్వా! ఒక చెంబుతో నీళ్లు పట్టుకరా!"

"ఇందా నాయినా!" అని అవ్వ నీటి చెంబు నా చేతికి యీయబోయింది. "నాకు కాదవ్వా! ఆ చోట్లో నీళ్లు చల్లు" అన్నాను రామలక్ష్మి నిలిచిన చోటు చూపి. అమాయకంగా మా అవ్వ నే చూపిన చోట నీళ్ళు చల్లింది, అందరు పక్కన నవ్వారు. "చాలు లే నీవేళాకోళం" అని మొఖం మూరదు చేసుకొంది మా అవ్వ.

మరునాటి ఉదయం బయలుకుపోయి వస్తూ వున్నాను, నాగలి భుజాన పెట్టుకొని, కాడి గిత్తల తోలుకొని కయ్య కాడికి పోతూ యున్నాడు చెంగయ్య మామ. నేను అతని కంట పడ్డాను ఎదు రుగా. మాట్లాడక తప్పలేదు.

"ఏమిరా! ఎప్పుడొచ్చావు?"

"నిన్న సాయంకాలం వచ్చాను."

"మరి యింటికి రాలేదేమి?"

"రావాలనుకున్నాను... కానీ......"

"జరిగిన దానిని మరచిపో నాయనా. విధి యెవ రిని విడిచింది? తలవని తలంపుగా అన్నీ జరిగాయి. మధ్యాహ్నం భోజనానికిరా?"

"... అట్లే కానీండి." అని చెప్పి నేను రామన్న ఇల్లు చేరాను. చెంగయ్య చేనులోకి పొయ్యాడు. మధ్యాహ్నం భోజన సమయానికి మామగారు వచ్చి పిలిచాడు భోజనానికి. రామన్నకూడా "పో మామా! పెద్దాయనవచ్చి చేతులు పట్టుకొని పిస్తున్నాడు" అని ప్రేరేపించాడు. ఇక పోక తప్పదు. చిన్నగా పొయ్యాను చెంగయ్య ఇంటిలోనికి. సుబ్బన్న మడిలో మడక దున్నేట్లుగా వుంది. రామలక్ష్మి ఒంట రిగా యింట్లో వుంది. చెంబుతో నవ్వుతూ నీళ్ళు ఎత్తు కొనివచ్చి నా దగ్గర నిలబడింది. నేను తీసుకోలేదు. క్రిందపెట్టి పోయింది. చెంబు ఎత్తుకొని కాళ్ళు కడుగుకొన్నాను. చెంగయ్య వీధి తిన్నెమీద వున్నాడు. పీట ముందర వడ్డించిన విస్తరివుంది. పంచ భక్ష్య పరమాన్నాలున్నాయి. కూర్చున్నాను పీట ముందర. కాని మనసు బరువైంది. కడుపు నిండి నట్లుంది. ఒక పిడికెడు మ్రింగాను మందులాగ. మూగనోరు పడియున్నాను. "తిను మామా" అన్న

హీనస్వరం వినబడింది. తలెత్తి చూశాను. చాల బల హీనురాలైపోయ్యా ననుపించింది.

"ఆహా! ఎంతటి మార్పు! ఆనాడు ముకుళితగా వుండిన రామలక్ష్మి పుష్పించిన గులాబి కన్యలా ఈనాడు! వికసించిన అరవిందానికి మంజుల మధుర రుచులను వెదజల్లే స్వేచ్ఛా పవన కుమారి దోహదం కరువైంది. కాబట్టే వాసనలేని పువ్వువలె వుంది రామలక్ష్మి. ఆ కాటుక కండ్లు. చెవులకు వ్రేలాడు జిమికీలు. నల్లని వాల్జెడ. పొంగి పోతున్న యవ్వన సౌందర్యాన్ని కప్పి పుచ్చుచుండు ఆ నిమ్మావళి చీర అంచులోని తేనెటీగల చిత్రాలు చూస్తూ యుంటే హృదయం ద్రవించి పోయింది. కాంతి మండలాల గుండా హృదయ దైన్య ప్రవంతి జల జలా పారి పోతూ వుంది. అయోమయంగా గొంతు రాలేదు నాకు మాట్లాడడానికి. సుబ్బన్న భార్య తాళి బొట్టులో నల్లని మచ్చ కనబడుతూ వుంది. వద్దన్నా నాలో యేవో భావాలు తోసుక వస్తూ వున్నాయి. ఇంతలో రామలక్ష్మి "తిను మామా" అని నా నిల బడిపోయిన హస్తాన్ని తన గులాబి చేతితో పట్టుకొని విస్తరవైపు వంచింది. నాకు కండ్లు కనబడటం లేదు. రామలక్ష్మి-కన్యకాదు. కాంత సుబ్బన్న ధర్మపత్ని. హిందూమత సాంప్రదాయానుసారం ఇతరుల భార్యలు తల్లులు కదా! స్త్రీ సాహసానికి లోబడరాదు మనిషి. కోపం వచ్చింది. హృదయం మండిపోయింది. "చా వదులుచేయి" అని విదిలించి లేచి చేయి కడుకొన్నాను. వీధి తిన్నెమీద కూర్చొనియున్న మామగారు "ఏమి నాయనా! భోంచేశావు కదూ!" అని అడిగాడు. "భోంచేశాను" అని జవాబిచ్చాను. నేను రామలక్ష్మి వలపు జ్యోతులని తెలిసికూడా తండ్రి యీలా దూరంగా వుండటం ఎంతవరకు న్యాయం? ఎవరు లేని గృహంలో నాకు రామలక్ష్మి చేతనే అన్నం పెట్టించడంలో రహస్యమేమి? ఇదేదో ఒక తంతు. లేక ...పరీక్షో... అర్థం కాకుండావుంది. నాకు. ఏలాగో పాఠశాల పరీక్షలో తప్పిన యీ పరీక్షలో విజయుడైనానని నా కెంతో గర్వంగావుంది. తాంబూలము తెచ్చి యిచ్చింది రామలక్ష్మి. అప్పుడే సుబ్బన్న మడకవిప్పి ఇల్లు చేరాడు. నా దగ్గర నిలిచి యున్న రామలక్ష్మి సుబ్బన్న రాకనుచూచి లోపలికి వెళ్లుతుందేమోయని తలచాను. చెంగయ్య "పోమ్మా! నీల్లీ పో!" అని చెప్పాడు రామలక్ష్మికి "ముంచుకొని కడుకొంటాడులే కాళ్ళు చేతులు" అన్న రామలక్ష్మి మాటలు విని నేను "వస్తాను మామా" అని చెప్పి చక్కా రామన్న యింటికి వచ్చాను. నేను పోయి కూర్చున్నానో లేదో రామలక్ష్మి వచ్చింది అక్కడికి. రామన్న, అవ్వ మరి కొందరు బంధువులున్నారు. అందులో ఒక పెద్దామె "పాడు పిల్లను వూరకే చంపారు పాపం! ఇష్టంలేని మొగుడ్తో ఎంతకాలం కాపురం చేస్తుంది." అనీ అనక పూర్వమే అందుకొని నేను "పెద్దోళ్ళనే పేశే కానీ... ప్రయోజనంలేదు మీ మాటలు. బుద్ధి లేనోళ్ళకు బుద్ధి చెప్పాలి. కాని ఉన్న బుద్ధినీ పూడ్చి పెట్టేందుకు ప్రయత్నించరాదు. సంసార సతీపతుల్లో ఎన్ని ఎగుడు దిగుడులున్నా సరిచేసుకొని పోవాలి."

"అదికాదు నాయనా! సుబ్బన్న దీనికన్న చిన్నోడు. చిన్నప్పటినుండి 'సుబ్బన్నా! రారా! పోరా!' అని పిలుస్తూ వుండిన రామలక్ష్మి వాణ్ణి గౌరవించటం ఏలాగు చెప్పూ?"

"ఏలాగు గౌరవించాలంటావా? అనాడు తాళి కట్టేటప్పుడు ఏలాగు తలవంచి మెడ యిచ్చిందో ఆలా యీనాడూ - ఏ నాడూ - పతి చెప్పిన మాటలకు తలొగ్గి అన్ని పనులు చేసుకొంటూ పోతే... అన్నీ సాఫీగా సాగిపోతాయి. భర్తను పూజించటం వల్లనే భార్యకు రక్తి, భుక్తి, ముక్తి."

"వయసులో చిన్నోడైనా మాటల్లో గొప్పోడవే" అని ఆ పెద్దామె మంగళవాక్యం చెప్పింది. జొట జొట కన్నీరు కార్చుతూ రామలక్ష్మి కొంతసేపు నిలబడి "వస్తాను అవ్వా" అని చెప్పి ఇంటికి వెళ్ళింది. మరునాడు బయలుదేరి మాగ్రామం చేరుకొన్నాను.

## 4

పన్నెండు నెలలు పరుగున పొయ్యాయి. ఉపాధ్యాయ అభ్యసన పాఠశాల తుది వర్షాంతర పరీక్షలై

ఇంటికి వెళ్ళాం అందరు. మా గ్రామానికి ప్రక్కన పంచాయితీ ప్రాథమిక పాఠశాలలో నేను ప్రధానోపాధ్యాయుడుగా పనిచేస్తూ యున్నాను. జాబు వచ్చింది... అత్తయ్య చనిపోయిందని... మేము ఎవరూ పోలేదు. మూడు నెలలు తిరగకముందే రెండో పెండ్లిచేసుకొన్నాడు చెంగయ్య మరదలినే. ఆమెను పెండ్లి చేసుకోపోతే ఆస్తి పాస్తులు అన్యుల పరమాతాయి కాబోలు. సంవత్సరం తిరిగే లోపల తనయుడు కలిగాడు చెంగయ్యకు. అనేక వర్షాలుగా కలలు గన్నది ఫలించింది. ఆనాటి నుండి రామలక్ష్మి కూడ తండ్రి ఆదరాభిమానాలు తగ్గాయి. పెండ్లై మూడు వర్షాలు నిండినా భర్తను పక్క యిచ్చిన పాపాన పోలేదు రామలక్ష్మి. "లక్ష్మీ" అని అనుంగు ప్రేమతో పిలిచే తల్లి దాటుకొంది. చిన్ననాడు సరసమాడిన మామగారు నీతులు రీతులు భాషించాడు. తండ్రి పుత్రికయైనా పుత్ర ప్రేమతో, ముద్దుగా "రాములూ!" అని పిలుచు తరుణం దాటిపోయింది. పుట్టిన బిడ్డ నోటిలో వెలువడు రంగారు, బంగారు రతనాల మాటలతో, రుచి పుట్టెడి తొక్కు పల్కులతో నూతన దంపతు లిరువురు నవసుధారసాన్ని గ్రోలుతూ స్వరంమర్చిపోతూ వున్నారు.

దిక్కులేని పక్షిలా, రుచులూరని జహ్వాలాగా, తన జీవితాన్ని యెంత కాలం గడుపుతుంది రామలక్ష్మి.

ప్రక్కపల్లె ప్రభాకర్ పడుచువాడు. యవ్వన వుప్పొంగులో కండ్లు తెలియని అంధుడు. ఏలాగో రామలక్ష్మిని తన వల్లో వేసికొన్నాడు. నిరీక్షిస్తూ వుండిన బికారికి చిక్కింది అమృత భాండమన్నట్లు రామలక్ష్మి ప్రపంచాన్ని నిరసిస్తూ ప్రభాకర్‌తో కామ లీలలకు కల్పుకొంది.

సుబ్బన్న పట్టి దద్దమ్మ. మొరటుబారిన దేహం. మందగించిన బుద్ధి. భార్యను సక్రమ పద్ధతిలో వుంచుకొనే సాహసంలేని సన్యాసి. తల్లిదండ్రులే దండించనప్పుడు తనకేమని తామసించిన అలసత పెద్దన్న. ఏమైనా మాట్లాడితే మాటకు పదిమాటలు వడ్డన జరుగుతుంది. "సంసారం గుట్టు, వ్యాధి రట్టు" అన్నట్లు — అరిస్తే మానం పోతుంది వీధిలో కూడా.

ప్రభాకర్ తల్లిదండ్రులు ప్రభాకర్ పోకడలు కనిపెట్టి చిన్న పిల్లైనా పరవాలేదని మేనత్త కూతురైన సుమతిని పెండ్లి చేశారు. ప్రభాకర్ "చిన్న పిల్లేకదా? సరేన"ని పెండ్లి చేసుకొన్నాడు. ప్రభాకర్ వలపు పవిత్రమైనదికాదు. క్షణిక తృప్తిపరుడు. భార్య యుక్తవయస్కురాలు కాదుకదా...? రామలక్ష్మితో రైలు ప్రయాణం చేశాడు. నెల్లూరుచేరారు ఎవరికీ తెలియకుండా ఇరువురు. సంఘంలో, కుటుంబంలో గౌరవంలేదు కనుక రామలక్ష్మి ప్రభాకర్‌తో ప్రయాణానికి తను తొడిగిన నగలతో తరలి వచ్చింది. దాదాపు వేయి రూపాయల నగలు. ప్రభాకర్ పట్టి అపద్దాలకోరు. కాలానికి తగ్గట్లు పరుగు లిడుతాడు. పోకపోతాడు. రామలక్ష్మి సాహసోపాయాలకు మెచ్చుకొంటూ భట్రాజై పోతాడు అప్పుడప్పుడు. అందర్నీ మరిచింది రామలక్ష్మి. ఆరు మాసాలు హాయిగా గడిచి పోయింది. వున్న నగలు వలిచాడు ప్రభాకర్ ఇక మిగిలింది తాలి.

రామలక్ష్మి తండ్రి, భర్తలు ఆమె పోకను సంతసించారే కాని - సంతసించలేదు - చచ్చిన దానితో లెక్కకట్టారు. ప్రభాకర్ తల్లిదండ్రులు చాల వెతికారు. తుదకు ఏలాగో ఆచూకి తీయగలిగారు. కాని ప్రభాకర్‌తో మాట్లాడేందుకు భయపడుతారు. యుక్తితోనే ప్రభాకర్‌ను ఇంటికి రప్పించాలనుకొన్నారు. "సుమతి పుష్పవతి అయింది. రేపటి శుక్రవారం నాటికి గృహప్రవేశం. నీవు తప్పక రావలయునని" ప్రభాకర్ అడ్రస్సుకు జాబు వ్రాశారు; జాబు సోమవారం చేరింది.

ఆ రాత్రంతా ప్రభాకర్ ఆలోచనా నిమగ్నుడైనాడు. 'కొత్తొక వింత పాతొక రోత' కదూ మరి! ఏలాగో రామలక్ష్మిని లాలించి వూరు చేరాలనుకొన్నాడు. ఉదయం ప్రభాకర్ "రామలక్ష్మీ! తెచ్చిన నగలన్నీ తెగనమ్మి తిన్నాం. ఇక మిగిలింది

తాళి బొట్టు. ఎన్ని రోజులు యిక దీనితో బ్రతుక గలం ? నేను యింటికి వెళ్ళి నా ఆస్తినంతా స్వాధీనం చేసికొని మనం ప్రత్యేకంగా రతీ మన్మధులవలె కాపురముంటాం. ఈ నాడే ఇంటికి పోతాం".

"అదిగో! మళ్లా నా మానం నలుగుర్లో పోగొట్టాలంటారా! వెలుపల పెట్టిన కాలు మళ్లా లోపల పెట్టమంటారా! అసలు మనల బ్రతుక నిస్తారా మీ వారు ?"

"నీవు వెలవు సుమా! నా మాటకు ఎదురెవరు? మా గ్రామానికి పోకపోతే మానె - ప్రక్క పల్లెలో బాడుగ ఇంట్లో వుంటాం. చేతినిండా డబ్బు వుంటుంది. జల్సాగా బ్రతుకవచ్చు".

"మీ యిష్టం ఆలించినా, పాలించినా! వెలించినా!

"అయితే బయలుదేరు ?"

"బండి చార్జీలూ ??"

"తాళిబొట్టు తెగనమ్మితే సరిపోతుంది."

"ఈ తాళిబొట్టా ?"

"అవును. ఆ తాళిబొట్టే నిన్ను సర్వ విధాలా నాశనంచేసింది. సంఘం దానివల్లనే నిన్ను అనుమానిస్తూవుంది. అలాంటి చిహ్నం అసలుండరాదు."

"ఈ తెంపు తోలినాడే చేసివుంటే"... నని తన మేనమామను తల్చుకొని భోరుమని యేడ్చింది రామలక్ష్మి.

"చాలులే! నీ చాందస్తం! నీ వెప్పుడూ జరిగిన దానికి చింతించుతూ యుంటావు. జరుగుచుండు జీవిత వారిధిని దాటుటెట్లని యుబలాట పడాలి. అంతే నాకు తెల్సింది." అని ప్రభాకర్ ధైర్య వాక్యాలు పల్కాడు.

"అయితే ఇంక మీ యిష్టం" అని తాళి తెంచి ఏడుస్తూ చేతికిచ్చింది. సాయంకాలానికి ప్రభాకర్ గ్రామానికి ప్రక్కపల్లె చేరారు ఇరువురు.

## 5

దైవ వశాత్తు సుమతి బుజువైంది సకాలానికి. మూడు మాసాల అనంతరం ప్రభాకర్ రామలక్ష్మిని అనాదరకంగా చూస్తూ వచ్చాడు. రామలక్ష్మిని ఒంటరిగా యింట్లో వదలి స్వగ్రామానికి పోయి రెండు మూడురోజులుకూడా వచ్చేవాడుకాడు. స్నేహితులు బంధువులు ప్రభాకరును మందలించేవారు అప్పుడప్పుడు. భార్య యుక్తవయస్సురాలైనాక కూడా వుంపుడు కత్తెను వుంచుకోవటం ఖ్యాతికి గొబ్బదెబ్బని కనబడ్డోళ్ళంతా ప్రబోధిస్తూ వున్నారు ప్రభాకర్‌కి. "రామలక్ష్మి నన్ను నమ్మి నాతో లేచివచ్చింది పచ్చని కాపురాన్ని పాడుచేసుకొని. నేనే సర్వమని విశ్వసించింది. ఏలాగుయిప్పుడు వదలివేయడం ? వదలకుంటే పదుగుర్లో తలెత్తేదానికే వీలులేదే! ఇంట్లో సుమతి యీసడించుకొంటూ వుంది. తల్లి దండ్రులు దూరమయ్యే లాగున్నారు. స్నేహితులు హేళన చేస్తూ వున్నారు. ఈ పిల్లదానివల్లనే నా సంసారం కూడా పాడగుతూ వుంది. తన దగ్గరనే సదా వుండాలని రోధ పెట్టుతుంది ఎప్పుడూ - నా భార్య ఏమి కావాలో మరి! తిని పారవేసిన మామిడిముట్టె రామలక్ష్మి. నా రాణి సుమతి సుమంగళి. అందాల భరణి. నవ యవ్వన శోభలో వలపు సొంపుల వేడి ప్రవాహం స్వాగతమిస్తూ వుంది నాకు. ఈలాంటి సుమధురవలపు కౌగిటిని కాలరాసి... రామలక్ష్మిని యింకా నేను ఎందుకు ఆదరిస్తూ వున్నాను ? దీని వల్ల అందరూ దూరమౌతూ యున్నారు. యశో కీర్తులకు గొప్ప అఘాత మేర్పడుతూవుంది. సంఘంలో గౌరవం నానాటికి సన్నగిలుతుంది. కుటుంబములో కొట్లాటలు కొల్లలుగా పుట్టుకొస్తున్నాయి. తన సంసారాన్ని స్వహస్తాల్తో నాశనంచేసిన... లచ్చిమి, నా కుటుంబాన్ని కూల దోయటంలో సందేహం లేదు ? ఏలాగైనా యీ నాటితో దీనికి వీడ్కోలియ్యాలి" అని దృఢ నిశ్చయంతో ప్రభాకర్ ఆనాడు రామలక్ష్మి దగ్గరికి వచ్చాడు. రక్తారుణ నేత్రాలతో వున్న ప్రభాకరును చూచి రామలక్ష్మి చాల భయపడింది. కన్నెత్తి చూసేందుకే సాహసించలేక

పోయింది. "ఏం! నీవల్ల నా పేరు ప్రఖ్యాతులు బొగ్గుపాలౌతున్నాయి, కీర్తి ప్రతిష్టలు బూడిదౌతున్నాయి. పో! ఎక్కడికైనా పో! నీ మొగుడు దగ్గరికిపో! లేకపోతే యే బావిలోనైనా పడిచావు... రెండు కాపురాలు సుఖపడుతాయి. కుల మర్యాదలు కుశల ప్రశ్నలు వేస్తాయి. పో! యిక నా కంటికి కనపడరాదు. లే" అని ప్రభాకర్ భీబత్స మాటలు విన్న రామలక్ష్మి హృదయంలో వెయ్యి తేళ్ళుపోతులు ప్రాకులాడినట్లైంది. లక్షల దితేళ్ళు కుట్టినట్లైంది. తల వేడెక్కింది. ఎదురు తిరిగి మాట్లాడక తప్పలేదు.

"ఏమండీ? మీరు నిజంగా మాట్లాడిన మాటలేనా ఇవి? ఎవరు చెప్పించారండీ యీలా తిట్టమని? నా తాడు తెంచి నన్ను కన్న యిల్లు నుండి తరలించి... ఈ నాడు అనాధనని, అబలనని కులటనని యీలా తూలనాడడం ఎంత న్యాయమండీ?" అని ప్రశ్నించింది రామలక్ష్మి.

"ఏమిటే! స్మృతిమించి రాగాన పడిందే నీ ప్రలాపం! ఇది లోకం! నీవేమిటే - నా గృహానికి రాణివేమిటి? అయ్యో పాపం! ఎంత జాణతనం? మన సొల్లని మొగునితో మాటాడకుండా వలపు కౌగిటిని యెడారి మయంగా చేసిన సంసారంలో "ఓయసిస్సు" లాగ నీ జీవితానికి సుధారసాన్ని ప్రసాదించినందుకు నీవు ఈలా మాట్లాడటం కృతజ్ఞతా? కృతఘ్నతా? చాలు నీ సాహసం. నీ సావాసం. ఇక సాగవు నీ సాని మాటలు! లే! లేచిపో! వెళ్ళిపో!!" అని ప్రభాకరు తన పాటను మేళవించి పాడాడు. పాపం! రామలక్ష్మి దిక్కులేని పక్షైంది. మారు మాటాడకుండా పాతకోక చంకనపెట్టి బయలుదేరింది ఎచ్చటికో? ఎవరికీ తెలియదు... కొందరు బావికి గుడ్డలు ఉతికేదానికి వెళ్లుతుందనుకొన్నారు... ఊరు దాటింది. ఆ వూరికి కొంత దూరంలో ఒక బావివుంది చాల లోతైన బావి. బావిదగ్గర నిల్చింది రామలక్ష్మి ఆకాశం వైపు చూసింది. శూన్యం గోచరమైంది. తన జీవితం అంతేనని తలంచింది. తల్లిదండ్రులను తల్చుకొంది. "ఏం మొహం పెట్టుకొని వారి దగ్గరకు పోవటం... సుబ్బన్న ఏమనుకుంటాడు. మేనమామ దగ్గరకు పోతామా? నన్ను స్వీకరించడు. ఇంకెచ్చటికో ఏల? అఖిలేశ్వరుడు సర్వాలను సృష్టించి, రక్షించి, శిక్షించే — సర్వేశ్వరుని దగ్గరకే వెళ్లుతాను. ఈ పాతాళ గంగే ఆయన దగ్గరకి తీసుకొని పోవుగాక." అని తీర్మానించి రామ బావిలో పడింది కాబోలు.

ఈలా నా తల చింతించి చింతించి వేడెక్కింది... ఈ విషయాలనే పెక్కుమార్లు తల్చుకొంటూ వుంది. కోడికి నాకు తెల్లవారింది.

ఉదయం బడికి సెలవు పెట్టాను. సాయంకాలం పార్కుకు వెళ్ళాను. రాజా నన్ను చూచి "ఏమి మోహన్ చాల చింతాక్రాంతుడవై వున్నావు?" అని ప్రశ్నించాడు. జరిగిన కథంతా చెప్పాను. "ఏవరు ఇందులో తప్పుచేశారో నిర్ణయించమ"ని ప్రశ్న వేశాను. "మనసొల్లని మొగుడే" ఇందుకు ప్రబల కారణ మన్నాడు. నీవేమంటావు?



# దివ్య సందేశము

శ్రీ స్వామి యస్. బి. కేశవయ్యగారు

[ఇది శ్రీశాయిబాబా మహాసమాధి దినసందర్భమున ది 14-10-56 నాడు శ్రీ కే. వెంకటస్వామినాయుడుగారి అధ్యక్షతన జరిగిన సమావేశములో శ్రీ స్వామి కేశవయ్యగారు వెలువరించిన దివ్య సందేశము. ఈ సందర్భమున వారి గృహముచెంత షెణాయ్ నగర్‌లో షుమారు రెండువేలమంది బీదలకు అన్నదానము జరిగినది. భగవన్నామ సంస్మరణతోటి, ఆరాధనతోటి, పలువురు పెద్దల భక్తి జ్ఞాన ప్రబోధములతోటి శ్రీ శాయిబాబా సమాధిదినము వేలకొలది ప్రజల భక్తి విశ్వాసముల మధ్య జరుపబడెను.]



సుఖ సంతోషాలకొరకు ప్రయత్నించడం మానవస్వభావం. తన స్వంత ప్రయత్నంవల్ల పొందగలిగిన సుఖం శాశ్వతమైనది కాదు. ఆనందమని భావించే ఇంద్రియసుఖాలవల్ల కలిగే సంతోషము, పరంపరగా కలిగే పరిణామాలలో తప్పనిసరిగా దుఃఖభాజనమవుతుంది. మానవజాతిని జీవితక్లేశాలనుండి ఉద్ధరించడానికి మహర్షులు, యోగులు యుగయుగాలుగా తరుణోపాయ సందేశాలతో అవతరిస్తున్నారు.

శాయిబాబా జీవితమంతా మానవజాతిపట్ల ఒక నిరంతరసేవలో గడచింది. ఆయన ఆధ్యాత్మిక పరిపూర్ణత, సోదర మానవుల శ్రేయస్సుకై అనేక విధాలైన అతిలోక శక్తులుగా వెల్లివిరిసింది. ఆశ్రయించినవారికి మనశ్శాంతినీ, నానా సంక్షోభాలనుండి తేరుకునే ఉపాయాన్నీ, జ్యోతిర్మయమైన ఆనందమార్గాన్నీ ఆయన ప్రసాదించెను. చాలా తేలికగా ఉండటమే సాయిబాబా ఉపదేశాలలోని విలక్షణగుణం. తత్త్వశాస్త్రాలలో మిక్కిలి దురవగాహములైన విషయాలను చాలా సులువుగా తేలికగామార్చి, నిత్యజీవితములోని మామూలు సంఘటనలతో ఉదాత్తపరచి, సాధారణ ప్రజానీకానికి అందుబాటులో ఉండేటట్టు చేశాడాయన. భక్తులకు కష్టసాధ్యములైన సాధనలను నిర్దేశించలేదు. దేవుని నామస్మరణచేస్తూ, సర్వపాపాలను పోగొట్టే అతని అపారకారుణ్యంపట్ల విశ్వాసముంచుకొమ్మన్నాడు. తన కరుణకు పాత్రులైనవారిలో సాయిబాబా అతివిచిత్రమైన పద్ధతిలో ఆధ్యాత్మిక పరివర్తనాన్ని తీసుకవచ్చాడు. నైతికబోధ ఆయన ఉపదేశాలలో ప్రధానమైన ఒక అంశం. భూతదయ, సత్యసంధత, నమ్రత చాలా ముఖ్యమైనవని ఆయన నొక్కి చెప్పాడు. ఇవి దేవుని అప్రమేయత్వాన్ని అర్థంచేసుకుంటే కలిగే గుణాలు. మానవహృదయాలలో దైవ

ధర్మపు సంపూర్ణాధిపత్యం సుప్రతిష్ఠిత మయ్యేదాక నిజమైన ఆనందం చేకూరదు.

రకరకాలైన అఘాతాలకులోనైన త్వరపాటు జీవితాలను గడపే నేటి మానవుల పరిస్థితుల సందర్భంలో సాయిబాబా సందేశమెంతో యుక్తంగా కనిపిస్తుంది. వ్యక్తిని, సమాజాన్ని, ఎదుర్కొంటున్న క్లిష్టసమస్యలను పరిష్కరించడంలో సాయిబాబా ప్రచారంచేసిన నైతికధర్మాలు అమూల్యములైనవి.

శ్రీ సాయిబాబా దైవాంశ సంభూతుడైనప్పటికి, బీదసాదలతోపాటు కలసిమెలసి, వారికుపదేశకుడుగానేగాక, మానవ ఐక్యమును సాధించే నిదర్శనంగా, ఉద్ధతపురుషుడుగా కాక, నమ్రాతినమ్ర మానవుడుగా ఉండేవాడు.

సాయిబాబా మహాసమాధిగతుడైన 38 వ. సాంవత్సరీకాన్ని సూచించే నేటి కార్యకలాపంయొక్క ప్రయోజనం అప్రమేయుడై, శాశ్వతకల్పుడైన ఆ మహాపురుషునికి చెందిందికాదు. శ్రీ సాయిబాబా ఆశీర్బలంతో మనశ్రేయస్సుకోసం పాటుపడుతూ, కాలందాటిపోతున్నదన్న సంగతి జ్ఞాపకముంచుకోవలసిన అల్పాయుష్కులైన మనకు చెందింది.

ఈ పుణ్యాదినంలో శ్రీ సాయిబాబా త్యాగజీవితాన్ని స్మరిస్తూ, ఆయన ఉపదేశాలను, ఆచరణలోపెట్టి, ఆయన కరుణకుపాత్రులై శాశ్వతమైన ఆనందాన్ని పొందడానికి మన జీవితాలను అంకితం చేద్దాము.

# పీడిత ప్రజలలో ఆత్మశక్తిని, సమరస సమైక్యతలను పూరించిన రక్షకుడు శ్రీ శాయిబాబా

శ్రీ సి. సి. పున్నయ్య

భగవంతునైనా, భగవదంశములుగల దివ్యపురుషులనైనా ఆరాధించుటకు, అనుసరించుటకు బాహ్యశుద్ధితోబాటు అంతర్శుద్ధి ప్రధానమైనది. పాపపు చింతలతోటి భగవన్నామ స్మరణచేసి కాని, పూజలు యాత్రలుచేసి కాని భగవంతుని అనుగ్రహమునకు పాత్రులు కాగలమని యూహించుట భ్రమలాంటిది. అంతర్శుద్ధి యనగా మనస్సును నిర్మలంచేసికొనుట. అహంను చంపుకొని, అవినీతికి, అన్యాయానికి, ఈర్ష్యకు, స్వార్థమునకు, దురహంకారమునకు హృదయంలో చోటులేకుండా చేసికొనుట వలన మనస్సు పరిశుద్ధము కాగలదు. అట్టి హృదయము స్పర్థలకు విబేధములకు, దురుద్దేశముల కతీతమై సర్వ భూతములను విచక్షణా రహితముగా ప్రేమించగలదు. దాని ననుసరించి మానవునకు స్వభావ సిద్ధముగా నమ్రత ఏర్పడును. అలాంటి పరిశుద్ధమయిన చిత్రముతో భగవంతుని ఆరాధించి, స్మరించినచో కలుగు ఆనందము శాశ్వతమైనదే కాక అనన్యమైనది కూడాను.

పూర్ణపురుషుడు, అవతారమూర్తియైన శ్రీ శాయి భగవానుడు తన ఆధ్యాత్మిక సంపదను, దివ్య సందేశమును, నిర్విరామ సేవాపరాయణతను ప్రజాహితానికి శాంతి సౌభాగ్యముల నుద్దేశించి అంకిత, మిచ్చాడు. అన్ని మతాలను, వర్గాలను సమన్వయపరచి ప్రజలలో సమరస సద్భావములను, సమైక్యతను, సేవాసక్తిని, దాన ధర్మాలను శ్రీ భగవానుని సందేశము పెంపొందింప జేసినది. విశాల హృదయంతో పారజూచిన వారు ఆనాడు, యీనాడు అను విచక్షణా రహితంగా శాంతి సౌభాగ్యముల కొరకు ఆరాటపడు ప్రజానీకానికి శ్రీ శాయి భగవానుని దివ్య సందేశము, జీవిత విధానముకంటె మరొకటి మార్గ దర్శకముగా నెంచ నవసరములేదు. ఈనాటి కల్లోలిత ప్రపంచానికి శ్రీ శాయిబాబా సందేశము అన్ని రంగాలలో శరణ్యమనునది సత్యసమ్మతమైనది.

తాను దేవాంశ సంభూతుడైనా మానవాతీతుడుగా వ్యవహరించక సామాన్య ప్రజల మధ్యవారితో పాటు కష్ట సుఖముల ననుభవించుచు నిర్విరామమైన మానవ సేవతో శ్రీ శాయి భగవానుడు తన జీవితమును గడిపెను. తన ఆధ్యాత్మిక శక్తిచే పాపపు చింతలతో నుండు అసంఖ్యాక పీడిత మానవులకు మానసికంగా, శారీరకంగా స్వస్థత చేకూర్చుటకు ఆయన సేవాకార్య కలాపములు, దివ్య సందేశము అమోఘంగా వినియోగించబడినవి. దానివలన భగవంతుని పట్ల అచంచలమైన విశ్వాసము, ఆత్మశక్తి, ప్రజల కేర్పడినవి. తన సందేశము పీడిత ప్రజానీకానికి శాంతి సౌభాగ్యాలను సమకూర్చగలవని మాత్రము బోధించి యూరుకొనక దాన్ని తాననుసరించి, ఆచరణలో పెట్టి ప్రజలను కష్టములనుండి, బాధలనుండి విముక్తులను చేయగలనని నిరూపించుటకు శ్రీ శాయిభగవానుడు చిత్ర విచిత్రమైన మార్గముల నవలంభించెను.

సత్యము, ప్రేమ, భూత దయలను ప్రబోధించు శ్రీ శాయిబాబా సందేశము మహిమాన్వితమైన మానసిక పరివర్తనను ప్రజలలో కలుగ జేసినది. తత్వశాస్త్రములలో దురవగాహనములుగా వివరించబడిన వానినే శ్రీ శాయి భగవానుడు సులభ మార్గంలో సరళంగా తన సందేశ రూపమున సామాన్య ప్రజలకు అర్థమయ్యేలాగ వివరించాడు.

సత్యము, ప్రేమ ప్రజల హృదయములను, మనస్సు

లను విశాలపరచునవి. తనమాటలవలన, మనస్సువలన యితరులకు కష్టనష్టములను, ద్రోహము తలపెట్టకూడనివి. సదా యథార్థమును న్యాయ ధర్మ చింతలతో పలుకుచు, ఉద్దేశించుచు గడుపు జీవితము పవిత్రమైనది. దానివలన మానవ హృదయంలో ఈర్ష్య, దురహంకారము, దురుద్దేశములు, అవినీతి, స్వార్థము నశించును. అట్లు పరిశుద్ధమయిన హృదయము విశ్వభూత ప్రేమపట్లు ఆ సక్తి చూపునప్పుడు మానవ జీవయాత్రలో ఏ రంగములోను ఒకరికొకరు అన్యాయమును, అక్రమమును తలపెట్టరు.

భూత దయ తోడి మానవులపట్లనేకాక మానవేతరములపట్ల సయితము దయా దాక్షిణ్యములు, పశ్చాత్తాపము, సానుభూతి, క్షమాగుణము ఆత్మ పరమాత్మలపట్ల విశ్వాసము కలవారుగా జేయును.

సత్యము, ప్రేమ, భూతదయ ప్రపంచ కళ్యాణమునుద్దేశించినవి. శ్రీ శాయిభగవానుని సందేశము ప్రపంచములో బహుళ వ్యాప్తమైనప్పుడు యీనాటి ప్రపంచ సంక్షోభము నిస్సందేహముగా అంతమొందగలదు. శాంతి సౌభాగ్యములు అవిచ్ఛిన్నముగా వర్ధిల్లగలవు. అప్పుడు మానవునకు, పరమాత్మకు సంబంధము మరింత సన్నిహితము కాగలదు.

'సర్వే జనా సుఖినోభవంతు'ను అపేక్షించనివాడు భగవత్కటాక్షమునకు పాత్రుడు కాలేడు. పరిశుద్ధమైన ఆత్మతో పరమాత్మను ఏ నామముతో స్మరించినను భగవంతుడు మనలను రక్షించి కాపాడగలడు. అందుకనే శ్రీ శాయి భగవానుడు తన భక్తులు, శిష్యులనేకులు తన వ్యక్తి స్వరూపమును గురించి తరచి తరచి ప్రశ్నించినప్పుడు "మీ రూహించు భగవన్నామములన్నియు నా స్వరూపమునకు చెందినవే. నాపట్ల విశ్వాసము కలిగి భగవన్నామములలో దేనిని స్మరించినను నన్ను స్మరించినట్లే కాగలదు. నన్ను నమ్మిన వారికెట్టి కొరతయుండదు; ఎట్టి భయ సందేహములకు అవకాశములేదు. మీపైనున్న భారమును నాపై నుంచుడు – నేను భరించెదను. నా అనుగ్రహ కటాక్షములను కోరినవారి కవి సదా అందుబాటులోను, అనుభవములో నుండును. మీరు కష్టములలోను, ఆపదలోను ఉన్నప్పుడు నా తలుపు తట్టి నన్ను లేపండి – నేను మిమ్ములను తప్పక రక్షించగలను" అని బాహాటంగా నమ్రతతో తోడి మానవులకు అభయ హస్తమిచ్చాడు.

శ్రీ భగవానుని జీవితము, సందేశము ప్రతియొక్కరు స్వీయశ్రేయస్సునుద్దేశించి అనుసరణీయము, అచరణీయమూను. నిస్పృహ, నిరాశలకు బలియయిన అనేకులజీవితాలు చిగిర్చుటకు తోడ్పడి సమరససమైక్యతలతోటి, సద్భావ సహకారములతోటి వర్ధిల్లగల నవసమాజ నిర్మాణమునకు అన్ని విధాల శ్రీ శాయి భగవానుని జీవయాత్ర, నైతిక బోధనలు వినియోగపడగలవు.

---

## కావ్యగానము

బాపట్ల, 18-10-56. బాపట్ల సరస్వతీ మెమోరియల్ బాలికా పాఠశాలా భవనమునందు కవయిత్రీతిలక, శ్రీమతి పిండిప్రోలు వసంతాదేవిగారు కావ్యగానముచేసిరి, దైవజ్ఞ శిరోమణి, విద్వత్కవి, శ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రిగారధ్యక్షత వహించి, కవయిత్రులనుగూర్చియు, శ్రీ వసంతాదేవిగారి కవిత్వమును గూర్చియు ప్రసంగించుచు ఈమె హృదయవాదిని అనియు "MYSTIC POETESS" అని నిర్వచించిరి. భాషాప్రవీణ శ్రీమాన్ రామానుజాచార్యులవారు, కవయిత్రిని ప్రశంసించుచు, ధారాశుద్ధి, ప్రసన్నతగల కవిత్వమనిరి. విద్వాన్ లంక లక్ష్మీనారాయణశాస్త్రిగారు ప్రసంగించుచు ఈమె కవిత్వము నిర్దుష్టమనియు ప్రాచీనాధునిక సంప్రదాయ సమ్మేళనరూపమనియు, వారి గురువులైన, స్వామీ శ్రీ శివశంకరశాస్త్రిగారి కవితా ప్రభావము చూచాయగా గోచరించుచున్నదనియు నుడివిరి. అధ్యక్షులు తమ ఉపసంహార వచనములో, ఈమె కవితా ప్రాశస్త్యమును, ఉదాహరణ పూర్వకముగా, తులనాత్మకముగా సమీక్షించిరి. పాఠశాలా సంఘ కార్యదర్శిని, శ్రీమతి భీమరాజు వరలక్ష్మి, B. A., B.ED. గారు వందనము లర్పించిరి.

# తపస్విని

కుమారి రావి గారి నాగేశ్వరిదేవి



ఆమె మహా తపస్విని బు
  ధాదర సంస్తవనీయశీల ని
త్యామల పుణ్యలోల జగ
  దంబ కటాక్ష విలాసలబ్ధ దీ
క్షా మహనీయ సద్గుణ వి
  శాలయశోన్నతఁ జాలఁ జూచితిన్
ధామము చూవె! విద్యలకు
  తల్లి సుమీ! మనుజాళి కెన్నఁగన్ ॥

కోపము లేదొకించుకయుఁ
  గోరిక లేదు మనంబులోన సం
తాపము లేదు నా పలుకు
  తథ్యము శాంతముపట్టుకొమ్మ తా
నోపును దార ధైర్యముల
  నుండఁ దపోన్నతిఁ బండి భక్తికిన్
రూపమె వాదు లేటికి? స
  రోజ దళాక్షి జగన్నుతిన్ గనున్ ॥

ఒల్లదీ భోగంబులెల్ల చేరిననైన
  ముక్తిసంపత్కాంక్ష మునుఁగుటేమొ?
పల్లవింపదు బుద్ధి పరజగంబులఁ జూడ
  నంతరాలోకన మందుటేమొ?
పరులతో భాషించు సరణి వర్తింపదు
  భూరికార్యజయంబుఁ బూనుటేమొ?
నిరతోపవాసముల్ జరుపుచుండు సతంబు
  కవితామృతాపాన ఘనత నేమొ?
నిత్యమేకాంత వాసంపు నియతినిలుచుఁ
గల్లగానెల్ల విశ్వముఁ గనుటనేమొ?
సత్యమీ మానవులమధ్య సంచరించుఁ
దెలియఁగారాదు తెలియక మెలఁగరాదు ॥

ఆ వైరాగ్యము నంతగాఁగొని బుధా
  హ్లాదంపు సద్వర్తనన్
భావానందము గూడ శాంతిపరతన్
  భాషించు విజ్ఞానమూ
పూవుంబోడినిఁ జెందెనో? యితర సం
  పూర్ణ ప్రభావంబునో
జీవోద్ధారణఁ బూనెనో? తెలియ దీ
  చిత్రంబు ముమ్మాటికిన్ ॥

ప్రేమ దయా స్వభావములఁ
  బెద్దయుఁ దోపఁ బ్రసన్నమూర్తియౌ
యామె మొగంబుఁ గన్నఁ బర
  మాద్భుత వర్తన మింత విన్న ని
త్యామల మాతృభావములు
  దారములై కనుపట్టుచుండు నే
నేమిట నెన్నఁగాదు బుధు
  లెన్నిన సూక్తి సుమీ! నిజంబుగన్



# బంగారు తిమ్మరాజు కథ

శ్రీ ఏకుమళ్ల కామేశ్వరరావు

—(౦)—

(ఆగష్టు సంచిక తరువాయి)

ముగింపు:— క్రమముతైన చదివి జూపెనె ఎల
నాగతో కావ్యములోన బెట్టినాది బంగారు తిమ్మ
రాజు కూడి మైన తొప్పించెనె యెలనాంగ సీతా
అత్తకోడలు ఇందరుగూడి గుండాన దుమికిరి.

"రిమార్కు:— అసమగ్రము. వ్రాత చక్కనిదే. తప్పులు కుప్పలు. గ్రంథ పాత శైథిల్యము ఉన్నవి. కథ స్పష్టముగా లేదు. ఇది గ్రంథలిపిలో నున్నది."

పై కథను పరిశీలిస్తే బంగారు తిమ్మరాజును గురించి మరికొన్ని సంగతులు తెలియవచ్చు. తంజావూరులోని ఈ గ్రంథాలయం సుమారుగా కృష్ణదేవ రాయల కాలంనుండి వస్తూంది. కాబట్టి దీనిలోని ఈ తిమ్మరాజు కథ కొంత పాతదే అని చెప్పవచ్చు.

## ఆనాటి రాజుల జీవితం

ఆనాటి రాజులు సర్వస్వతంత్రులు. ఈ పదంలో మంత్రుల ప్రశంస లేదు, కవుల ప్రశంస లేదు. పెద్ద రాజుల అధికారం కింద చిన్న రాజులు పరిపాలించేరు.

ఈ కథ నిండ రాజుల జీవితం, ఆచార వ్యవహారాలు వర్ణించబడ్డాయి. ఇప్పటిలాగె అప్పుడుకూడ సంతానం కోసం దేవుళ్ళకు మొక్కుకొనేవారు. రఘుపతి మహారాజు, ఆయన భార్య, తిరుపతి కొండ మీద ఏడు సంవత్సరాలు తపస్సుచేసి సంతానాన్ని కన్నారు.

రాజు ప్రయాణ మవడానికి ముందు ఇంటివారం దరి దగ్గర సెలవు పుచ్చుకొన్నాడు. ఇప్పటికీ ఈ ఆచారం మన సంఘంలో ఉంది. రాజు ప్రయాణ మవడానికి ముందు భేరీ మోగిస్తారు, కోటలో ఎర్ర జెండా ఎత్తుతారు.

రాజుల కింద చిన్న రాజు లుంటారు. వారు ఒక్కొక్కప్పుడు క్రమంగా పన్నులు చెల్లించరు. దస్తు వసూలు చేయడానికి వెళ్ళినవారు నానా ఇబ్బందులు పడతారు. ఈ కథలో దస్తు వసూలుకి వెళ్లిన అధికారికి ప్రాణమే పోయింది.

రాజు ప్రయాణానికి ఎటువంటి వేషం ధరించేడో చూడండి—

బంగారపు కిరీటమయినా తాను పెట్టినాడు.
ముత్యాలంపు. రత్నాలంపు హారం వేసినాడు.
నిలువుటం గీతురాయి పక్షేషు తాను పెట్టినాడు.
ఏనుగుమీద హౌదావేసి ఎదుటికి తెచ్చేరు.

అప్పటి రాజులు వారిలోవారు, ఇప్పటి క్షత్రియులు, జమీందార్లలాగె వర్తిస్తారు. తల్లి కొడుకును 'మీరు' అని మర్యాదగా పిలుస్తుంది. అట్లే కొడుకు కూడ.

రాజులకు పాలదాదులుంటారు. వారి యందు రాజుల కెంతో గౌరవం. పాల దాదిని అసలు తల్లిలాగె చూచుకొంటారు. ఆమె పన్నెండు మంది చోపుదార్లతో ప్రయాణ మయింది. రాజులు ఒకరి నొకరు ఎదుర్కొవడంలో కొన్ని మర్యాద లున్నాయి. కులహీనుడైన నారప్ప దీనిని ఈ విధంగా అభినయించేడు—

హౌదావేసి యేనుగు నిచ్చె నారప్పకు అంత
పాలకీలను, పరిజనములను ఇచ్చి పంపినారు
ఏనుగు మీదను ఎక్కి వెళ్లెను సవరం వారప్ప
డాలు కత్తులు ఈటెలతోను తర్లి వెళ్ళినాడు.

వచ్చేవాడు సారప్ప గాక రాయలే అని భ్రమ పడి తిమ్మరాజు ఎట్లు మర్యాద చేసేడో చూడండి—

* * * * ఎదురుకున్నారు రాజపుత్రులండి,
పల్లకి దండె చేత బట్టుకుకూడ నడిచేరు,
వంగి వంగి సలాములు చేసినారువారు.

రాజ మర్యాదలు ఆలాగుంటాయి. ఇప్పటి రాజుల లాగ అప్పుడుకూడ ఆడవారిని 'అయ్యా' అన దం కద్దు. రాణి పేరు మేనయ్యగారు.

ఈ మధ్య వరకు మనలో ఉండిన ఒక్క ఆచారం ఆ కాలంలో పాటించ బడేది. తిమ్మరాజుకి, మాణిక్యదేవి నిచ్చి వివాహం చేసేరు. ఆమె భర్త ఇంటికివచ్చింది. కాని పునస్సంధాన మింకా కాలేదు. కనుక రాజు ఆమెతో నేరుగా మాట్లాడ కూడదు. అందుకని అతను తమ్ములను, పాల దాదిని తోడుగా తీసుకువెళ్ళి, పాల దాది ద్వారా పరజా వెనుక నున్న మాణిక్యదేవితో మాట్లాడేడు.

సంతానం లేనట్టి రాయలు ముచ్చట కోసం మొసళ్ళను పెంచి వాటికి నగలు, నాణేలు పెట్టిం చేడు. రాజుల భోజనాలను వంట బ్రాహ్మణులు తయారు చేసేరు.

రాణి తన కొడుక్కి ఎట్లు దిష్టి తీసిందో చూడండి—

తల్లిగారు దృష్టన్నాది, బహుకాని దృష్టి !
నాలుగు పుట్ల వరహాలండి దిష్టి తీసినారు !
ఏనుగులను ఏడింటిని దిష్టి తీసినారు !
నాలుగు పుట్ల నల్ల బొగ్గులు దిష్టి తీసినారు !

ప్రశ్న పుస్తకం సలహా తీసుకోడం ఒక ఆచారం. తిమ్మరాజు పాదాలలో సాముద్రిక శాస్త్రం ప్రకారం పద్మాలున్నాయట ! వాళ్లకి శకునాలలో ఉండే నమ్మకానికి మితిలేదు, ఆ శకునాల సంఖ్యకూ మితి లేదు. శకునాలు కొన్ని —. కుంకుమ బొట్టు నేల పడుతుంది. వెండి మట్టెలు పగులుతాయి. చేతి గాజులు చిట్లుతాయి. రాజు ప్రయాణానికి వెళ్లడం అపజయమని సూచిస్తూ ఏనుగు చస్తుంది. గుర్రం చస్తుంది. పల్లకి విరుగుతుంది. కత్తిజారి పడుతుంది. ఏనుగు కన్నీరు కారుస్తుంది. కోవెల దీపాలు కొం డెక్కి పోతాయి. రణ భేరీ పలుకులో అపశకునం కనబడుతుంది. ఆదివారం పడమటికూల కాబట్టి ప్రయాణం చేయకూడదు.

## ప్రజా జీవితం

ఈ పదంలో సామాన్య ప్రజా జీవితం కొద్దిగా కనబడుతుంది. గోవిందప్ప అనే అతను చిన్నరాజు దగ్గరకు దస్తు వసూలు కోసం వెళ్లగా ఆ రాజు—

కోటయివతలి నున్న పురాళ్లు తీసుకు వెళ్లమనిరి
బురుజుమీది ఆరిక గడ్డి పట్టుకు వెళ్ల మనిరి
డాలు కత్తిలో పైసాయున్నది తీసుకు వెళ్లమనిరి
మాటలు పడక గోవిందయ్య ఒప్పినాడు కాదు
గోవిందుని పట్టుకొన్నారు ముట్టడి చేసినారు
కోట వెలపల నల్ల రాళ్లకి బలి నరికినారు.

ఈ మోస్తరుగా నమ్మకమైన ఉద్యోగి రాజ సేవలో ప్రాణాలను ధార పోసేడు.

వల్లెపు రమణమ్మ ఒక పల్లె మనిషి అనగా జాలరిది. ఆమె తిమ్మరాజుయొక్క పాల తల్లి అయి నందువల్ల రాచ మర్యాదల నందింది. ఆమె వీర వనితగా ప్రవర్తించింది. వీర స్వర్గం పొందింది.

రంగసాని బోగంది. రాజుగారి ఉంపుడు కత్తె అయింది. అది, దాని తమ్ముడు దుర్మార్గంగా ప్రవ ర్తించి రాజ వంశానికే ముప్పు తెచ్చి పెట్టేరు. రంగ సాని తన అలకను రాయల ముందర ఈలాగు కనబర చింది.

రాయల జాడలు చూచినదయ్యా ఆ పాతకురాలు
ఇంట దీపము, కంటకాటుక పెట్టలేదయ్యా
తెల్ల వస్త్రము, నల్లని కురులు ముడువలేదయ్యా
తల్లి చచ్చిన శోకం వలెను ఏడుస్తున్నాది.

రంగసాని వెంట దాని తమ్ముడు, నారప్ప మద్దెల పాటగాడు. వాడు ఇట్లు వేషం ధరించేడు.

మద్దెల, తాళం చేత పట్టెను సవరం నారప్ప
బంగారంపుగళ్ల రుమాలు తలకి జుట్టినాడు
భుజబందులు భుజములనిండ తానె కట్టినాడు
పదివేళ్ళకు ఉంగరంబులు తానె బెట్టేడు.

రంగసాని నవరత్నాల పద్మములు వేసిన రవిక తొడిగి, బంగారపు జరీ పువ్వుల చీర కట్టి, ఏడు వారాలసొమ్ములు పెట్టి, కాళ్ళకి గజ్జెలుకట్టి, నాట్యానికి సిద్ధమయింది. ఆమె పచ్చి బానలమీద అరిటాకులు వేసి, దానిమీద వడ్లుపోసి మోళీ నాట్యం చేసింది.

సాహుకారులు జాబులు తీసుకురాగా వారికి రాజు సేమానులిచ్చేడు.

రణ భేరీ వాయించడంలో పద్ధతులున్నాయి. అదురు భేరీ వేస్తే ఏదో ప్రమాద ముందని అర్థం. కుదురు భేరీ వేస్తే ఏమీ ఫర్వాలేదని అర్థం. కత్తులలో డాలు కత్తులు, పఠాను కత్తులు అను రెండు రకాలున్నాయి.

ఆ కాలంలో మహాలుల కట్టడం నేర్పు చూడండి—.

పాలుపోసి ఎత్తవచ్చును రంగసాని మహాలు 'పాలుపోసి ఎత్తవచ్చు'నను దేశీయం ఇప్పుడుకూడ వాడుకలో ఉంది.

రాయలు తనకు పిల్లలు లేకపోగా మడుగులలో మొసళ్ళను పెంచి వాటికి ఈ కింది నగలు చేయించి పెట్టేడుట!

ముంగు ముక్కరలు, కర్ణ పుష్పములు మొసళ్లకు
నండి!
కంఠ కోరలు (?) కాలు అందెల మొసళ్లు కల
వండి!

ఇట్లు ఆనాటి జీవితం కొంత ఈ కావ్యంలో ప్రతిబింబిస్తూంది.

## వ్యంగ్యత

చారిత్రక సంఘటనలను తీసుకొని: ఈ జంగం కథ సృష్టించ బడింది. సమకాలికవ్యక్తులను, వారి నిజ నామాలతో, వారి వారి దోషాలతో చిత్రించడం ప్రమాదకరం. కాబట్టి కవి వ్యంగ్య పద్ధతిని ఆశ్రయించేడు. వ్యంగ్యత చాటున ఏమి చేసినా ఋజావుకు రాదు కదా!

ఓబరాయడు, కొండమాంబిక వంటి దుష్టులే నారప్ప, రంగసాని. తిమ్మరాజు బంగారంలాంటి వాడు. కాబట్టి బంగారు తిమ్మరాజయేడు. లోకులు భావించినట్లే ఈ కవికూడ సవరం నారప్ప రంగసానులు దుర్మార్గులని, పెనుగొండ రాయలు అవివేకి అని, బంగారు తిమ్మరాజు నిర్దోషి అని చిత్రించేడు, జంగం కథా సంప్రదాయాలను అవలంభించి ఈ కథను రచించేడు.

## పాత్రలు, పాత్రపోషణ

కథా నాయకుడు బంగారు తిమ్మరాజు, అతను పితృ భక్తి కలవాడు. పెద్ద తండ్రి పిలువ నంపేడు కదా అని పెనుగొండకు ప్రయాణమయేడు. శైవ భక్తిపరుడు కాబట్టి దారిలో దివ్య క్షేత్రాలను దర్శించేడు. కాని ఇతరుల సలహామీద మార్గంలో ఆగేడు, ఆత్మ గౌరవాన్ని నిలబెట్టుకొనే మనిషి. కాబట్టి రాజ వీతితో వచ్చిన నారప్పకి తగిన ప్రాయశ్చిత్తం చేసేడు. రాయలు, బోగందియైన రంగసాని వలలో పడి రత్నంలాంటి బిడ్డడి మీద పగ వహించేడు. యుద్ధంలో తిమ్మరాజు మరణించేడు.

ఈ కథలో రాయలి తర్వాత ముఖ్య పాత్రలు రంగసాని, దాని తమ్ముడు నారప్ప. ఇద్దరూ పరమ దుర్మార్గులు. రంగసాని విద్యలు ఆమె దుర్మార్గపు ఎత్తులకు సాయపడ్డాయి. ఆ దుర్మార్గుల వలలో తగులుకొన్న రాయలు తన కుమారుడికి అపకారం చేసుకొన్నాడు. ఆ దుర్మార్గులు చివరకు జయం పొందక మరణించేరు.

ఈ కావ్యంలో కవి మనకు చక్కని పాత్రల నిచ్చేడు. తిమ్మరాజు పాత్ర రాజ వంశపు పాత్ర. సామాన్యుల పాత్రలు రంగసాని, ఆమె తమ్ముడు. వీరిద్దరు కథలో ద్రోహులు.

ఏ పాత్రకి తగినట్టు ఆ పాత్ర గమనం ఈ కథలో కనబడుతుంది. పాత్రపోషణ ఉచితంగా ఉంది.

## సుఖాంత కావ్యమా?

కథా నాయకుడైన బంగారు తిమ్మరాజు ఏ పాపమూ ఎరగడు. అతను అన్యాయంగా అపవాదుల పాలై యుద్ధంలో మరణించేడు. అతనితో పాటు పినతండ్రులుకూడ కత్తులతో పొడుచుకొని మరణించేరు. ఇది దుఃఖాత్మకమే కదా! కాని కవి కథను అంతటితో ముగించక తిమ్మరాజు మరణానంతర మతని తమ్ములు రాజ్యాన్ని ఏలేరని సుఖంగా ముగించేడు. ఇట్లు అంతం మాత్రమే మార్చబడింది.

## జంగం కథా లక్షణాలు

జంగం కథలన్నిటికి కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి. ఆ లక్షణాలను కొన్నిటిని ఈ కవి గమనించేడు. తిమ్మరాజు తలిదండ్రులు తపస్సు చేయగా వరప్రసాదిగా తిమ్మరాజు జన్మించేడు. కాబట్టి అతను దేవతలతో మాట్లాడ గలడు.

ఈ కథలో ద్రోహి పాత్రలు సవరం నారప్ప, అతని అక్క రంగసాని. రంగసాని పేరు, మాణిక్యదేవి కూడ జంగం కథలలో తప్పవు. ప్రధాన వీరుడైన తిమ్మరాజు మరణించేడు. కాని కథ సుఖాంతం చేయబడింది.

ఏడు, పన్నెండు సంఖ్యల సంప్రదాయం పాటించబడింది. శకునాల మీద నమ్మకం వెల్లడించ బడింది. ఈ విధంగా కొన్ని జంగం కథా లక్షణాలు కనబడుతున్నాయి.

## రచన, శైలి

బంగారు తిమ్మరాజు పాటలో మానవ స్వభావం సున్నితంగా చిత్రించబడ్డ పట్లున్నాయి. అంతకు ముందు పతిని తిన్నగా చూడనటువంటి మాణిక్యదేవి, తన భర్త దుశ్శకునాలను లక్ష్యం చేయకుండ ప్రయాణానికి సిద్ధపడుతూండగా, తాను భర్త ఎదుటికి వచ్చి, అతని కాళ్లు పట్టుకొని బతిమాలుకొంది. అప్పుడే భార్య ముఖమును సరిగా చూసిన తిమ్మరాజు వెళ్లిపోతూ, దారిలో ఆమె అందాన్ని తలుచుకొని విచారించేడు. ఈ పట్టు మంచాలా బాల చంద్రుల రంగాన్ని జ్ఞప్తికి తెస్తూంది.

ఆ రాజ్యంలో అదివరకు ఏమీ యుద్ధాలు జరగలేదన్న సంగతిని కవి రణ భేరీ ద్వారా చక్కగా తెలయజేసేడు. రణ భేరికి అంతకు పూర్వం చర్మమే లేదట! ఇప్పుడు అవసరం కాగా జంతువులను చంపి చర్మాలు తెచ్చేరుట. చల్లగావున్న రాజ్యానికి ఎటువంటి పాట్లు వచ్చేయో!

ఈ కథ నిండా సంఘటనలున్నాయి. మనం వర్ణనలు అనుకొనేటటువంటి దీర్ఘ వర్ణనలు దీనిలో లేవు. అటువంటి వర్ణనలు వల్లతంగాళ్ కథలో ఎన్నో ఉన్నాయి.

ఈ కథలో కాలం ఐక్యత (Unity) ఉంది. కథ జరిగిన కాలం కొన్ని నెలలు మాత్రమే ఉంటుంది. దీనిలో నేరుగా హాస్యరసమున్న పట్లు కనబడవు.

కథనిండ శకునములున్నట్లే, ప్రకృత్యతీతం (Super natural) కూడ ఉంది. రాజు కంచికివెళ్లి ప్రార్థించగా శివ కంచిలోని కామాక్షి, విష్ణు కంచిలోని వరదరాజు అతనివెంట వెళ్ళేరు. అట్లే తిరుపతి దేవుడుకూడ వెళ్ళేడు. వంటలు చేయలేక బ్రాహ్మణులు పారిపోగా కంచినుండి వచ్చిన దేవతలు పదార్థాలను వడ్డించేరు. తిమ్మరాజుయొక్క ఘనతను ప్రకటించడానికి మాత్రమే ఇది కల్పించ బడ్డాయి.

కథలో అతిశయోక్తులు లేకపోలేదు. నల్లతంగాళ్ కవివలె ఈ కవికూడ సంఖ్యా జ్ఞానాన్ని పాటించలేదు. పెనుగొండ రాయలు పద్దెనిమిదికోట్ల వరగ

జాలను పాలిస్తున్నాడట! ఈ కోట్లు ఆదాయమైతే సబబు.

ఈ పాట శైలి సులభం. దీనిని సామాన్య జనులు విని హర్షించాలంటె అట్లే ఉండాలి. సూటిగావచ్చే భావాలకు సరళ శైలి సహజం.

ఈ కథలో వచనంకూడ ముఖ్యమైనది. ఇది కథలోని భాగమే. కాంభోజరాజు, బాలనాగమ్మ, చిన్నమ్మ కథలలోకూడ అట్లే.

## మాటలు, జాతీయాలు

ఈ జంగం కథలో ఈ కింది దేశీయాలు కొన్ని ఉన్నాయి. నెత్తి పిడుగు లవడం (చచ్చుట) (పుట 4), గుండె ఝల్లు మనడం (5), కొండ ముచ్చు (= దుర్మార్గుడు), వెన్నుదగిలి వెంటఉండడం (= అంగరక్షగా ఉండడం) మొదలైనవి.

దీనిలో హిందూస్థానీ పదాలు చాల ఉన్నాయి. ఇవన్నీ ఆనాటి వాడుక భాషలోవె! మచ్చుకి ముస్తాబు (2), లడాయి (2), పితూరి (2), జాగీరు (3), ఫర్మానా (4), మజిలీ (4) సలాం, పరగణా (3), ఝూటాకోరు (6), హౌదా, పక్షేను (13), హుకుం (23), ఖైదు, మొఖాసా, ఈనాం (23). ఇటీవలి పాటగాళ్లు చేర్చిన మాటలు ఫిడేలు, బీరువా (1).

పుస్తకంలోని అచ్చు తప్పులకు మితిలేదు. చక్కగా పరిష్కరించి ముద్రించడం, అత్యవసరం.

---

## శ్రీమతి పిండిప్రోలు వసంతాదేవిగారి సమ్మాన సభ

స్త్రీహితైషిణీమండలి (బాపట్ల) వారు అక్టోబరు 16-వ తేదీన శ్రీమతి పిండిప్రోలు వసందేవి గారికి తమభవనములో సమ్మానము చేసినారు. మహోపాధ్యాయ, సాహిత్యాచార్య, సాహిత్యసమ్రాట్, కవీంద్ర, శ్రీ స్వామి శివశంకరు శాస్త్రి గారు సభాధ్యక్షత వహించిరి. అధ్యక్షులు వైదిక, లౌకిక, సంస్కృత, పాలి, ప్రాకృత భాషలలోను, ఆంధ్ర భాషలోను కవయిత్రులనుగూర్చి సూచనగా ప్రసంగించిరి.

మండలివారు కవయిత్రిని రజతసామాగ్రితో బహూకరించినారు. శ్రీమతి వసంతాదేవిగారు తమ అముద్రిత కావ్యములనుండి ఖండకృతులను శ్రావ్యముగా గానము చేసినారు. దైవజ్ఞశిరోమణి, విద్వత్కవి, బ్రహ్మశ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి గారు కవయిత్రినిగూర్చి సంస్కృతాంధ్ర హిందీ, వంగ, ఆంగ్ల భాషలలో కృషిచేసిన దనియు, అంతర్ముఖియనియు చెప్పి ఆశువుగా పద్యరూపమున ఆశీర్వదించిరి. ఈమె సరస కావ్యము లల్లిన ప్రతిభ కలదనియు ఉగ్గడించిరి.

మండలివారు శ్రీ వసంతాదేవి గారికి కవయిత్రీ తిలక బిరుదమును నిరూఢము చేసిరి. అనంతరము వైణికవిద్వాన్ అయ్యగారి సోమేశ్వరరావుగారు తమ శిష్యురాండ్రచే గానము చేయించిరి.

సుప్రసిద్ధకవయిత్రి, మండలికార్యదర్శిని యగు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ గారు కవయిత్రిని ఆశీర్వదించిరి. శ్రీమతి కామరాజు వేంకటలక్ష్మమ్మగారి వందనాదికములతో సభ సమాప్తమైనది.

# శ్రీ రామ కర్ణామృతము

( ఆంధ్రానువాదము )

శ్రీ కల్లూరి అహోబలరావు.



(గతసంచిక తరువాయి)

౫౧

శ్రీరామ ! వింటిని జేఁదాల్చి బాణముల్
  సంధించి విడిచెడు సమయమందు
భీషణారావంబు వెలువడి, దిక్కుల
  న్నియు నిండుకొనిపోవు నిగమచరిత !
భూకంపములు వేగబుట్టు, నాకాశంబు
  బ్రద్దలై, పడియలువాఱు ; వనధి
క్షోభించు ; రాక్షసశూరులు మరణింత్రు ;
  పర్వత తతులెల్ల బ్రద్దలగును.
దేవతావళి తలలూచు దివ్యముగను
సీత సంతసంబొందును శ్రీకరముగ
రామ! శుభనామ! శ్రీరామ! రామచంద్ర!
నీ భుజశ్శక్తి నాకు వర్ణింపవశమె ?

౫౨

రమ్యమైనట్టి కమలనేత్రములవాఁడు
ప్రభలవెలుగొందు నీలగాత్రంబువాఁడు
ధన్యమైనట్టి శుభచరిత్రంబువాఁడు
వాఁడు మావాఁడు శ్రీరామవల్లభుండు.

౫౨ (a)

చండదానవధ్వాంత మిత్రుండు, తపన
కుల పవిత్రుండు, రాముండు, గుణమ
  యుండు ;
భూమిజాత కళత్రుండు, పుణ్యయశుఁడు
దశరథ వరపుత్రుండు, కోదండధారి
నాకు మిత్రుఁడతనికి, వందనమొనర్తు.

౫౩

సీత తల్లి రాముఁడు తండ్రి, స్నేహితుండు
లక్ష్మణుఁడు, హనుమంత, నలాంగదాది
వీరవానర బంధువుల్ వెలసియుండ
భయ విచారంబు నాకేల పట్టువడును ?

౫౪

వైదేహికెప్పుడుఁ బ్రాణమంత్రంబైన
  రామ మంత్రముసాటి భూమిఁగలదె ?
విబుధ వరేణ్యుల వినుతిపాత్రంబైన
  రామ మంత్రముసాటి భూమిఁగలదె ?
దైత్యుల మర్దించి స్తోత్రపాత్రంబైన
  రామ మంత్రముసాటి భూమిఁగలదె ?
జగతీ జనుల మోక్షసాధనమైనట్టి
  రామ మంత్రముసాటి భూమిఁగలదె ?

రఘుపతీ ! నీ పరమమంత్ర మఘముబాపు,
దాశరథి ! నీ పరమమంత్రమాశలుడుపు
జానకీనాథ ! నీ నామస్మరణమందె
ముక్తిచేకూరు ; వేయేల భక్తవరద !

గీ॥

మందార పుష్పసమ్మానితమైనట్టి
పాదపద్మంబులు బరగువాఁడు

ఇంద్రుండు, బ్రహ్మ, మునీంద్రులచే, నమ
స్సులఁగొను చరణముల్ గలుగువాఁడు

లక్ష్మణుండొకప్రక్క లలనసీతాదేవి
రెండవ ప్రక్కలోనుండి, తన్ను

సేవింప, విష్ణుఁడై చెలువొందె, కోదండ
ధారియై, శాంతుఁడై దనరువాఁడు

చంద్రుఁబోలువాఁడు, జలజనేత్రమువాఁడు
మలయపర్వతంపు మధురగంధ

మొదలిపూతగాఁగఁ గడుచెల్వుఁగలవాఁడు
రాముఁ డతనిఁగొల్తుఁ బ్రార్థనముల.

గీ॥

పుడమి నిక్ష్వాకు వంశానఁ బుట్టినావు
అనఘు సుగ్రీవు పూజల నందినావు
పొంచి, త్రిభువనములను, రక్షించినావు
సత్యవాక్పాలనంబును జరిపినావు
పద్మనేత్రంబులనుగల్గి వరలినావు
రాఘవా! రామచంద్ర! భద్రాద్రిరామ!
నిన్ను సేవింతుఁ బూజింతు నిశ్చలముగ
నన్ను రక్షింపుమయ్య! సంపన్నచరిత!

(సశేషము)



"సౌత్ ఇండియా ఆఫీసు : 5/149, బ్రాడ్వే, మద్రాసు 1."

# దసరా-సరదా

"శార్వాణి"

"నాన్నా! రేపు పండగటగా!" బయటనుంచి వచ్చి, కమీజు విప్పుతున్న వెంకటేశ్వర్రావు నడిగాడు మధు.

"ఎవరు చెప్పార్రా?" కమీజు కొక్కానికి తగిలించి, ఒక చేయిలేని కుర్చీమీద తాపీగా కూర్చున్నాడు.

"రేపు దసరా పండగని మా మాస్టరు చెప్పారు. కొత్తబట్టలు వేసుకొని గిలకలు పుచ్చుకొని బడికి రమ్మన్నారు."

మధు తండ్రికి దగ్గరగావచ్చి నించున్నాడు.

"రేపురా మాపురా మళ్లీ రమ్మనక!<br>
పావలా అయితే గిట్టేదిలేదు<br>
అర్ధ రూపాయి అయితే ముట్టేది లేదు<br>
రూపాయి అయితే పుచ్చుకుంటాము"

ప్రక్క యింట్లోంచి బడి పిల్లలు పాటలు పాడుతున్నారు.

"విన్నావా నాన్నా! అట్లాగే రేపు మేము గిలకలు తీసుకొని బయలుదేరుతాము. మరి కొత్తబట్టలు ఎప్పుడు కొంటావ్!"

కొత్తబట్టలు మాట వినేసరికి, వెంకటేశ్వర్రావు త్రుళ్లిపడ్డాడు. అంతర్యంలో ఏదో చేయలేనితనం బాధగా బరువుగా మూల్గింది.

"నాన్నా! నాకో కొత్త బట్టలు" బడి నుంచి వచ్చిన పాప నవ్వుతూ తండ్రి దగ్గరకువచ్చి మారాం చేయడం మొదలు పెట్టింది.

వంటింట్లోంచి వచ్చిన కుసుమ వాళ్ళకు కన్పించకుండా, కిటికీ నానుకొని నిలబడింది.

"నాన్నా! మాట్లాడవేం!" మధు భుజం పట్టుకొని వూపుతున్నాడు.

"ముందు నాకు కుట్టించిన తర్వాత అన్నయ్యకు." పాప చిరు కోపంగా మధు వంక చూస్తోంది.

"ముందు నాకే కుట్టించాలి!"

"ఊహుఁ! ముందు నాకె!"

అన్నా చెల్లెళ్లు పోట్లాడుకోవడం ప్రారంభించారు. వెంకటేశ్వర్రావు యిద్దర్నీ చేతులతో దగ్గరగా లాక్కొని, తల నిమురుతూ వారించాడు.

"పెద్దవాడివి. నీవు దెబ్బలాడకూడదు బాబు!" మధు వైపు ముద్దుగా చూశాడు.

"మరి చెల్లాయి చూడు." బుంగ మొహం పెట్టాడు మధు.

"అది చిన్నపిల్ల. దానితో నీవుకూడా సమానంగా పోట్లాడితే అంతా నవ్వుతారు. శాంతంగా వుండాలి."

ఎదురుగుండా వచ్చి నిలబడిన భార్యను చూచి,

"చూశావా నీ పిల్లలు! ఎంత హడావుడి చేస్తున్నారో?" అన్నాడు.

"మీరంతా మాటలు సందడిలో భోజనం సంగతి మరచి పోయారా!" భర్త కళ్ళలోనికి చిలిపిగా చూస్తూ అంది కుసుమ.

"వీళ్ళకు బట్టలు కుట్టించే అంతవరకు నన్ను కదలనిచ్చేటట్లు లేరు."

"మీ నాన్న బట్టలు కొంటారు. భోజనానికి రండి." పాపను వంటింట్లోనికి తీసుకొని వెళ్తూ, వెనక్క-

తిరిగి చూచింది. వెంకటేశ్వర్రావు యింకా లేవలేదు. కూర్చునే వున్నాడు.

"కూరలు చల్లారి పోతాయి. అందులో మీ కిష్టమైన కూర గుత్తి వంకాయి... లేవండి." అని కుసుమ వెళ్ళిపోయింది. మధు తల్లివెంట పడిచాడు. వాళ్లు కన్పించే వరకు చూచి, వెంకటేశ్వర్రావు ఆలోచనలో పడ్డాడు.

పిల్లలకు బట్టలు కుట్టించక పోతే బ్రతక నివ్వరు. మొన్న వెళ్ళిపోయిన వినాయక చవితికి కుట్టించలేదని పెద్ద గొడవ చేశారు. ఆ రోజు పూజ చేయనని బిగుసు కూర్చున్నారు. వాళ్ళను సముదాయించేసరికి ఆరోజు అతని తలప్రాణాలు తోకకు వచ్చాయి. రేపు బడిలో విద్యార్థులంతా కొత్త బట్టలు వేసుకొని వస్తారు. శ్రీమంతుల బిడ్డలు విలువైన గుడ్డలు ధరించి వస్తారు. మధ్య కుటుంబీకులు సాధారణమైన దుస్తులు తొడుక్కొంటారు. మరీ పేదవారు చినిగిపోయిన కమీజులకు సంస్కారంచేసి, నాగరికతకోసం బలవంతంగా నవ్వును తెచ్చుకుంటూ బయలుదేరతారు.

"మా నాన్న ఎంత మంచి బట్టలు కుట్టించాడో చూశావా ?" ఖరీదైన దుస్తులు ధరించిన విద్యార్థి, ఇస్త్రీ బట్టలు వేసుకున్న పేదవిద్యార్థిని అడుగుతాడు. మొదటి విద్యార్థి రెండవవాడు బాధ పడతాడని గ్రహించడు. తన గొప్పను ప్రకటించుకుంటాడు. తనలోతాను మురిసిపోతుంటాడు. రెండవవాడికి బాధ మిగులుతుంది. తన దారిద్ర్యంమీద అసహ్యించుకుంటాడు. అసూయ పడతాడు.

"మీరు గొప్పవాళ్ళు గనుక మంచి బట్టలు కడతారు. పేదవాళ్ళం మా కెట్లాగ వస్తాయి" అక్కసంతా వెళ్లగక్కుతాడు.

రేపు తన కొడుక్కికూడా అటువంటి అనుభూతి సంభవిస్తుంది. వాడు బాధ పడుతాడు. ఇంటికివచ్చి వాళ్ళంతా ఆవిధంగా అన్నారని ఏడుస్తాడు. బడికి వెళ్ళనని పట్టుపట్టి కూర్చుంటాడు. అసలేవాడు రణపెంకి. వాడ్ని సముదాయించేసరికి బ్రహ్మ పెళ్ళవుతుంది.

వెంకటేశ్వర్రావుకేమీ పాలుపోవడంలేదు. చేతిలో చిల్లికానిలేదు. నెలలో సగం రోజులైనా పూర్తిగా నిండకముందే జీతం హారతి కర్పూరంలాగ హరించి పోయింది. మళ్ళా ఒకటవ తారీఖుకోసం వేళ్లను లెక్కపెట్టుకుంటూ కూర్చోవడం.

రెండవ తారీఖున అప్పులవాళ్లు వీధి గుమ్మంలో "క్యూ"లో నిలబడతారు.

ఇంటద్దెవాడు మొదట నిలబడతాడు. వాడి అద్దె తీర్చేసరికి, జీతంలో మూడవవంతు భాగం పోతుంది. అపరాలవాడు, పాలమ్మాయి, కట్టెలవాడు, కూరగాయలమ్మాయి, వీళ్ళందరికీ సమాధానం చెప్పేసరికి, చేతిలో ఒకటో అరో మిగులుతుంది. మళ్ళా రెండవ తారీఖు నుంచి కాతాలకు ప్రారంభోత్సవం జరుగుతోంది. ఆ ప్రారంభోత్సవానికి ఎవర్ని ఆహ్వానం చేసిన రారు. బట్టల కొట్టులో కాతా లేదు. వాళ్ళు ఇస్తే పెట్టేవాడే! అధిక జీతాలు తెచ్చుకున్న వాళ్ళకే అక్కడ కాతాలకు స్థానం దక్కేది.

తనో !

గుమాస్తా !!

జీవితానికి అడుగడుగునా ఋణపడే రాస్తా !!!

"ఏమండీ ! ఇంకా ఆలోచిస్తూనే ఉన్నారా ! వాళ్ళ బట్టలు మీ బుర్రంతా కరాబు చేస్తున్నట్లున్నాయి. తీరుబడిగా ఆలోచించుకుందురుగాని, ముందు భోజనానికి లేవండి !"

కుసుమ, అతని ఆలోచనల్ని చెల్లా చెదర చేసి, మధ్య నవ్వుతూ నిలబడింది.

కచేరీలో పీక వరకూ పని. రాత్రింబవళ్లు కష్టపడినా ప్రతిఫలం సంతోషరహితం. రెక్కలు విరిగేటట్లు కష్టపడినా, డొక్కలు సంపూర్ణంగా నిండవు. సంతృప్తిలేదు. సంతోషంలేదు. భర్త కష్టం గురించి భార్య అర్థంచేసుకోలేదు. బాధను బరువుగా మొదకు

ప్రేలాడేసుకొని, నిరాశను నెత్తిమీద మోస్తూ ఇంటికి వచ్చే భర్తను చూస్తుంది.

మిద్దెమీద వుంటున్నమ్మాయి కొనుక్కున నెక్లేసు లాంటిది, ఎదిరింటమ్మాయి వేసుకున్న జాకెట్టు లాంటిది ...ఇటువంటి లిస్టు ఒకటి తయారుచేసి, గుమ్మం ఎక్కడంతోనే భర్తకు నివేదించుకుంటుంది. భార్య నివేదనను భర్త నిర్వేదిస్తున్న సంగతి కాలం కనిపెడుతుంది. ఆఫీసులో అధికారికి నచ్చచెప్పలేక, జీవితం మీద సగం ఆశ వదులుకొని ఇంటికివస్తే, ఇల్లాలు మిగత సగం ప్రాణం తీస్తుంది.

ఆ మానవుడు బ్రతికేదేలా ?

కాని కుసుమ అటువంటిదికాదు. భర్త కష్టాల్లో సరి సమానంగా భాగం పంచుకుంటుంది. గుట్టుగా సంసారాన్ని వున్న దాంట్లోనే పొదుపుగా వాడుకుంటూ, భర్తను సుఖ పెట్టడానికి తన సాయ శక్తులా ప్రయత్నం చేస్తుంది. ఎన్ని కష్టాలు కలిగినా, ఎన్ని విస్ఫారాలు నిలిచినా, తేలిగ్గా ఎదుర్కొంటుంది. బాధ పడుతూ ఆఫీసునుంచి వస్తున్న భర్తను, చిరునవ్వుతో ఆహ్వానించి సంతోష పెట్టేది. వెంకటేశ్వర్రావుకి పునర్జన్మను ప్రసాదించింది కుసుమ. జీవితంమీద ఆశను చంపుకున్న అతనికి, మళ్లా బ్రతకాలనిపించింది.

"మీ ఆలోచనా మీరూనూ! లేవండి భోజనానికి" చేయి పట్టుకొని, వెంట పెట్టుకొని వెంకటేశ్వర్రావుని భోజనం దగ్గర కూర్చో పెట్టింది. మధు పాప భోజనాల దగ్గర అంతకముందే కూర్చుని తింటున్నారు. వాళ్లవంక చూడ్డానికి భయపడుతున్నాడు వెంకటేశ్వర్రావు. అతడు ఎదురుగుండా కన్పిస్తే, బట్టల విషయం జ్ఞాపకం చేయకుండా మానరు. తండ్రి దగ్గర డబ్బు లేదని, ఆర్తి, బాధ, దుఃఖమంటే తెలియని ఆ పసిపాపల కేమితెలుసు ?

"మీ నాన్న ఏం చేస్తారు ?" మధు స్నేహితుడు మధును ఒకసారి అడిగాడు.

"మా నాన్న ఆఫీసరు" గర్వంతో సమాధానం చెప్పినప్పుడు, వెంకటేశ్వర్రావు స్వయంగా విన్నాడు. తనలో తాను నవ్వుకున్నాడు. ప్రపంచం దృష్టిలో అతడు గొప్పవాడుకాక పోయిన, కొడుకు దృష్టిలో గొప్పవాడయినందుకు, అతను పట్టరాని ఆనందం అనుభవించాడు.

తను, గుమాస్తా అన్న సంగతి గుర్తువచ్చిన వెంటనే నిట్టూర్చాడు.

"నాన్నా! బట్టలు!" అన్నం కలుపుకుంటున్న తండ్రిని చూశాడు మధు.

"కొందాములా!" గబ గబా అన్నం కలిపి కాస్త ఎంగిలి పడిలేచి, బయటకు వెళ్ళి పోబోతున్న భర్తను చూచింది కుసుమ.

"తిరిగి అన్నం వేయించుకోకుంటానే లేచాలేం!" పక్క చేతికిచ్చి, తమల పాకుల యీనెలను తీస్తూ, సున్నం రాసి యివ్వబోయింది.

వెంకటేశ్వర్రావు పక్కను నములుతూ తమలపాకులను తీసుకోనకుండా వెళ్ళిపోయాడు.

గతుకుల బాటమీద జీవిత గమనాన్ని వెనక్కి తిరిగి చూస్తున్న, అతనికి కన్పించేది రాళ్ళబాట... ముళ్ళతోట.

ముందుకు వడివడిగా నడుస్తున్నాడు. కష్టపడిన రోజులు, ఋణపడినట్లు చూస్తున్నాయి. కష్టానికి ప్రతిఫలాన్ని అందివ్వలేక పోయేమని విలపిస్తున్నాయి.

"బ్రతుకున్నాం! ఎలా ?" వెంకటేశ్వర్రావు గుండెమీద కొశ్చన్ మార్కు.

సమాధానం కోసం నరనాడులు నోళ్ళను తెరచుకొని కూర్చున్నాయి.

"చావలేక బ్రతుకుతున్నాం!" పాడు పడిన రోడ్డుమీద ఎత్తు పల్లాలకు సరిచేస్తున్నాడు కష్ట జీవి.

"దేనికోసం!" ఎవర్నడగాలి ?

"పొట్టకోసం!!" ఎవరు సమాధాన మిచ్చేది ?

కండరాల్ని ఎముకల్నీ పెంచుతున్నాడొకడు.

"దేనికోసం ?" ఎవర్నడుగుతున్నాం ?

"పొట్టలు కొట్టటానికి ?" సమాధానం వస్తుంటే వినిపిస్తుందా ?

కష్టం మొకరిది... సుఖం వేరొకరిది.
కన్నీరొకరిది... పన్నీరు వేరొకరిది.
"బాబుకి కమీజు కొనాలి."
"పాపకు పరికిణీ కుట్టించాలి."

ఆశలను విశాలంగా చేస్తున్న జీవితం, నిశలో నిరాశగా నించుంది.

"ఆశలను పెంచుకొని నెరవేరలేకపోతే బాధ పడే దానికంటే, ప్రతి విషయంతో నిరాశ పడటంలో సుఖం వుందిరా !" రాఘవరావు మాటలు వినిపిస్తున్నాయి.

కనీసపు అవసరాలు ఆశలా ? చావలేక బ్రతకడం కోసం కోరుకోవడం ఆశా ??

వెంకటేశ్వర్రావుకి రేపు జరగబోయే పండగ జ్ఞాపకానికి వచ్చింది.

జీవితంలో మళ్ళా బ్రతకమని, పునర్జన్మ ధరించమని ఆశ పెడుతోంది రేపు. నిన్న చనిపోయిన నేను రేపు బ్రతుకుతాను. రేపు బ్రతికి ఎల్లుండి కోసం బాధ పడను.

నిన్న కష్టం గురించి బాధ పడినా,
రేపు మంచి కోసం ఆశను పెంచుకొని,
ఎల్లుండి జీవితానికి గట్టి పునాదులు వేస్తాను.

మధు కొత్త కమీజు కొత్త పంట్లాము వేసుకొని, చిన్ని గిలకను పట్టుకొని, జయ జయధ్వనులు చేస్తూ బడికి వెళ్తాడు. పాప పువ్వుల వోణీ, సిల్కు చోళీ ధరించి. పాటలు పాడుకుంటూ బయలు దేరుతుంది.

ఎంత ఆనందం !
ఎంత అందం ! !

రోడ్డుమీద తీయ్యటి కలలు కంటున్న వెంకటేశ్వర్రావు స్నేహితుడు రామారావు ఇంటికి చేరుకున్నాడు. తలుపులు వేసికున్నాయి. గుమ్మం దగ్గరకు వచ్చి నిలబడ్డాడు.

"ఇవ్వాళ సినిమాకు వెళ్ళ వలసిందే ! మీరెన్నో సినిమాలు చూస్తారు. ఒక్క సినిమాకుకూడ తీసుకొని వెళ్లడానికి అంత ఇదవుతారు దేనికి !"

రామారావు భార్య మాటలు స్పష్టంగా వినిపించాయి.

"అబ్బబ్బ ! డబ్బు లేదని మొత్తుకుంటే నా ప్రాణాలు కొరుక్కొని తింటావు దేనికి !" భార్యకు కనువిప్పు చేయడానికి నానా అవస్థలు పడుతున్నాడు స్వతంత్ర దేశంలోని భావి భారత పౌరుడు.

"అంతా వట్టిది ! నే నడిగే సరికి డబ్బుంచుకొని లేదనెందుకు బుకాయిస్తారు. మగవాళ్లను నమ్మకూడదు. అన్నీ అబద్ధాలేకదా !"

"అబ్బ ! ఉండవే ! ఎవరైనా వింటే నవ్వుతారు." బ్రతిమాలుకుంటున్నాడు బయటకు వచ్చినపుడు పెద్ద కబుర్లు చెప్పే జీవుడు.

"ఎవరూ వినకుండా వెళ్దాం ! పదండి !" మళ్ళా మొదలకు వచ్చింది.

"నా దగ్గర రాగి దమ్మిడీ లేదు. తర్వాత నీ ఇష్టం" చరమాంకం — ఆఖరి పుట తిప్పాడు.

"రేపు విజయదశమి రేపు వెళ్దాం ! మంచి రోజు కూడాను." సూర్యగ్రహణం పట్టు విడువలేదు.

"పండగ డబ్బున్నవాళ్ళకు... మనకు కాదు."

"అసలు మిమ్మల్ని అడగటమే బుద్ధి తక్కువ. అసలు మగవాళ్లను నమ్ముకొని ఏ ఆడది బాగుపడింది"

తర్వాత ఇద్దరి మధ్య మాటలు వినిపించలేదు. రామారావుని అడిగినా ప్రయోజనం లేదని, వచ్చిన దారి పట్టాడు. ఆశ నిరాశల మధ్య నలిగిపోతున్న వెంకటేశ్వర్రావు.

లోకం నల్లని చీరను కప్పుకొని విచిత్రంగా చూస్తోంది. తెల్లని బాటమీద నడుస్తున్న అతనికి తర్వాతి ప్రయత్నం గురించి తట్టడంలేదు. వెనుకనుంచి కారు హారను విన్పించినా తప్పుకోలేక పోయాడు. కారు ఆపుచేసి తలుపు కిటికీ నుంచి తల బయటకుపెట్టి గుడ్లు మిటకరించింది. నాల్గు వందల పౌన్లు గల్గిన మానవాకారం.

"బ్రతకాలని లేదా! రోడ్డు మధ్యగా నడవక పోతే, కొంచెం ప్రక్కగా నడవకూడదూ!" చీదరించుకుంటూ కారు చీకటిలో దూసుకు పోయింది.

బ్రతకాలనిలేదు. అయినా బ్రతకాలి. బ్రతికి ఎవర్ని ఉద్ధరించడానికి! ఎవర్ని సుఖ పెట్టడానికి! ఉద్ధరణకు, సుఖానికి దూరమయినపుడు బ్రతకడంవల్ల ప్రయోజనం? అదే అర్థంకాదు. ఆలోచిస్తే ఏమీ లేదు. అందరూ బ్రతుకుతున్నట్లే తనూ బ్రతకాలి. కష్టమో నిష్ఠూరమో కాల ప్రవాహంలో కొట్టుకు పోవాలి. మూడు కాలాల్లాగ మూడు దశల జీవితం చుట్టేవరకూ, బ్రతకాలి....

రోడ్డు ప్రక్కనున్న రావిచెట్ల రెమ్మలు గాలికి గజ్జలశబ్దం చేస్తున్నాయి. చీకటిని చీలుస్తూ దీపాలు అక్కడక్కడ వెలుగుతున్నాయి. వీధి కుక్కలు ఎంగిలిస్తాకులకోసం వెతుక్కుంటున్నాయి. పిడికెడు కవళంకోసం బిచ్చమెత్తుకుంటున్నారు అనాథలు. అడుక్కోలేక బ్రతకడంకోసం దొంగతనం చేస్తున్నారు దొంగలు. కడుపు కక్కుర్తికోసం, మానానికి వెలకట్టి, చీకటిలో శీలాన్ని వేలంవేస్తున్నారు పడుపుకత్తెలు, పెరిగిపోతున్న ధనాన్ని భరించలేక, తిన్న పదార్థాలను జీర్ణించుకోలేక, అంతస్తులలో అద్దాల గదులలో బూరుగుదూది పరుపుల మీద ఆపసోపాలు పడుతున్నారు శరీరాలను పెంచుకున్న శ్రీమంతులు. కష్టాలను చెప్పుకోలేక, ఆకలి మంటలతో అల్లల్లాడిపోతున్నారు పూరిగుడిసెల్లో నిరుపేదలు.

అర్థంకాని ఆవేదనతో, స్వార్థంలేని పరమార్థంతో జీవితవలయాలకు చుట్టుతున్న వెంకటేశ్వరావుకి వంకరగీతలు కన్పించాయి. అవన్నీ బీటలువారిన బాటలు తీసుకుపోతున్నాయి. ఆలోచనల ఆకారాలు అధికమవుతున్నాయి. మెదడు బరువెక్కింది. చీకటిని భరించలేకపోతున్నాడు. ఇంకా కొన్ని చూడలేకపోతున్నాడు. ఉప్పుటేరు వంతెనదాటి వచ్చాడు. గంటస్థంభ మీద గడియారం కాలాన్ని కాలుస్తోంది. చిన్నముల్లు తొమ్మిదికి పదికి మధ్య ఎర్రగా నిలబడింది.

చాల ఆలశ్యమైపోయింది. కుసుమ తనకోసం ఎదురుచూస్తూ వుంటుంది. తనింకా తిరుగుతున్నా డని బాధపడుతుందేమో! డబ్బు చిక్కలేదని గ్రహిస్తే, పిల్లల్ని పిలిచి కేకలేస్తుంది. ఇంటికి త్వరగా వెళ్ళిపోవాలి. వట్టిచేతులతో వెళ్ళితే, మధు ఎదురైతే, వాడికి ముఖంయెట్లా చూపించేది? చంటిదింకా నిద్రపోయి ఉండదు. కొత్తబట్టలని కలవరిస్తుంది. కుసుమ దాన్ని ఒడిలో వేసుకొని జోకొడుతూ ఉంటుంది.

"అమ్మా! నాన్న పరికిణీ తెచ్చారా!" చిన్ని నోటితో చంటి అంటుంది.

"తప్పకుండా తీసుకొనివస్తారమ్మా!" అని కుసుమ తప్పకుండా చెప్పే వుంటుంది.

"అమ్మా! నాన్నింకా రాలేదేం? ఇంకా బట్టలషాపులోనే ఉండిపోయారా? మంచి బట్టలు దొరకలేదనుకుంటాను." అని మధుకూడా మేల్కొనే వుంటాడు. రేపటి గురించి, ఇప్పట్నుంచే ఆలోచిస్తూ సంబరపడుతుంటాడు.

అతనికి తెలియకుండా భూమి గుండ్రంగా తిరుగుతున్నా, నిజంగా భూమి అప్పుడు తన చుట్టూ తిరుగుతున్నట్లే అన్పించింది. తల తిరిగిపోతోంది. నెమ్మదిగా నడుస్తున్నాడు. ఎదురుగుండా భవనం కన్పించింది. అది అతని స్నేహితునిది. చదువుకుంటున్న రోజుల్లో, వాళ్ళ ఇద్దరి మనస్సులలో భేదంలేదు. భేదానికి అర్థంలేదు. పెద్దవారయ్యారు. వివాహాలయ్యాయి. బాధ్యతలు పెరిగాయి. మనస్సులు

(601-వ పేజి చూడుడు)

# 'రాగమయి'

### శ్రీ విజయ - రాఘవ

(సెప్టెంబరు సంచిక తరువాయి)

"ఇందులో బావ తప్పేమీ లేదు. మా సంసారం అంటే గిట్టనివాళ్లెవరో బావను యేడ్పించడానికి యిలా వ్రాసివుంటారు" అని మనస్సులో స్థిమిత పడింది. అయినా మొగంలో గుర్పాటు, కంగారు కనిపించాయి. రఘునాధంకి ఆ సూచనలన్నీ సూక్ష్మంగా అర్థమైనయి. ఇంతలో రాగమయి లేచి వెళ్లుతుండగా - "ఎందుకో బాధపడుతున్నావ్ పాపా" అన్నాడు. రాగమయి మెట్లుదిగుతూ "అబ్బే! యేంలేదు బావా! వస్తా" అంటూ గదిలోకి వెళ్ళి పడుకొంది.

5

రఘునాధం ఒక్కడే వాకిటరుగుమీద కూర్చొని యేవో తెగని సమస్యల్ని గురించి ఆలోచిస్తున్నాడు. 'ఎవరో?' రఘునాధంకోసం వచ్చారింతలో. అతన్ని లోపలికి రమ్మనమని ఆహ్వానించాడు.

"ఫరవాలేదులేరా! నీ భోజనమైందా"! అని అడిగాడు. ఇప్పటికిగాని గుర్తురాలేదు రఘునాధానికి ఆ వచ్చిందెవరో - చిరునవ్వొక్కటి నవ్వాడు. "ఆ ... యిప్పుడే అయింది మామయ్యా!" అన్నాడు. "అయితే అలా పోదాంరా. కాసేపు మాట్లాడుకొద్దాం..." అంటూ రఘునాధాన్ని బయటికి తీసికెళ్లాడు. ఇదంతా రాగమయిచూసి సుందరమ్మ దగ్గరకు ఆదుర్దాగావచ్చి కూర్చుంది. అప్పటికి తొమ్మిదిగంటలయింది. అందరూ అన్నాలుతిని సావకాసంగా కూర్చొన్నారు. రామాలయంలో యింకా భజనలు చేస్తూనేవున్నారు. రాగమయి రావడంచూసి—

"యేమిటేపాపా! పరుగెత్తుకొచ్చావ్" అంది సుందరమ్మ.

"నాకు నిద్రపట్టడంలేదే!" అంది రాగమయి.

"కాసేపు యేదైనా చదువుకోకూడదూ. వచ్చిన కాస్త చదువూ మరిచిపోవాలా!" అంది సుందరమ్మ.

శ్యామసుందరి యిదివరకటి మల్లే మాట్లాడంత తగ్గించింది. గట్టిగా మాట్లాడితే దగ్గుతెరవస్తుంది. అవసరమైనప్పుడు స్పష్టంగా మాట్లాడటం జరుగుతోంది.

"పాపా! నా పుస్తకాలన్నీ యేపెట్టెలో పెట్టావ్" అంది శ్యామసుందరి బత్తాయికాయితోలు తీస్తూ.

"నీ పుస్తకాలు - నా పుస్తకాలు అమ్మ పెట్టెలో సర్దాను అక్కయ్యా!" అంది రాగమయి.

"అమ్మా! మనం రేపెప్పుడే వెళ్ళేది?" అంది శ్యామసుందరి.

రాగమయికి భయంవేసింది. నోరుజారి విషయమంతా ప్రాక్కుస్తుందేమోనని. రాగమయికి దొరికిన ఆ చిరిగిన వుత్తరం శ్యామసుందరి చదివిన తరువాత ఒక్క నిముషంసేపుకూడా ఆ యింట్లోవుండే తలంపు వెనుకంజవేసింది. మా సంసారం మూలంగా నిష్కళంకమైన రఘునాధం బావకి అపవాదులు తెచ్చిన వాళ్లమవుతున్నాం. మనం తప్పకుండా యీ యింట్లోంచి వెళ్ళిపోవడం మంచిదనే దృక్పథంలోనే వుంది శ్యామసుందరి. కాని యిదంతా యిలా జరిగిందని రాగమయిగాని, శ్యామసుందరిగాని చెప్పలా. ఆ వుత్తరం యెవరు బావకు వ్రాసిందీ తెలియలేదు గాని, విషయం అంతా బాగా అర్థంచేసుకొన్నారు. తెలుసుకున్న సంగతులేవీ తేలకముందే రాగమయి అర్థరాత్రివేళ వెన్నెల్లో బయలుదేరివెళ్ళి రఘునాధంతో ముఖాముఖిగా మాట్లాడి తేల్చుకొద్దామని అభిప్రాయపడింది. కాని, తీరా, వెళ్ళిన తరువాత బావను చూడంగానే తనలో అడగవలసినవన్నీ

అణిగిపోయాయి. పిల్లిలాగా డాబాదిగివచ్చింది. యిదంతా రాగమయి ముఖంద్వారా శ్యామసుందరి విన్నది. రాగమయిని యిలా ప్రోత్సాహపరిచింది శ్యామసుందరే. "దీని కంతటికీ తానే బాధ్యుడనని చెప్పతాడేమో" అనుకొంది శ్యామసుందరి. తను తల పోసిన ఉద్రేకరూపంలో రాగమయి సమాధానాలు లేవు. "సుందరమ్మకు తెలియకుండా యెంతకాలం యీ విషయం కప్పిపుచ్చగలం" అని రాగమయి - శ్యామసుందరి కాసేపు ఆలోచించారు. "ఒకవేళ బయటపెడదామా! అమ్మ సామాన్యమైన మనిషి కాదు. తల్చుకున్నదంటే అదే దారి. వున్నపాళాన లేచిపోతున్నా అనే వదంతిగాలేచి వీధిలోకివస్తుంది. ఒక్కసారి మంచో, చెడ్డో నమ్మిందంటే అదే యిక అంతాను. ఎంతమంది చెప్పినా దానిమాటే దానిది. ప్రయాణం సంగతి చూడబోతే యింకా రెండు రోజుల్లో వుంది. రఘునాథం డబ్బుయిస్తేగాని వీళ్లేధ్గా అన్నట్లు సుందరమ్మ కలవరిస్తోంది. యిది యెలా పరిష్కారం అయ్యేది!" రాగమయికి దారి తెన్నూ తోచటంలేదు.

"అమ్మా! తెల్లవారుఝామునే ఒక బండివుంది దానికివెడితే హాయిగా వుంటుంది. నాలుగున్నరకల్లానే లేపుతాను. అన్నీ సిద్ధంచేసి వుంచావుగాదే పాపా!" అంది శ్యామసుందరి రాగమయివంకా, సుందరమ్మవంకాచూసీ.

"అదేమిటే శ్యామా! అంత తొందరేం. రేపే వెళ్ళడమేమిటి? ఎల్లుండిగా అనుకొంది వెళ్ళడమని!" సుందరమ్మ ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

రాగమయి మెదలకుండా యిద్దరిమధ్యా సతమతమవుతూ వూరుకూర్చుంది.

రఘునాథం యింకారాలేదు.

"ఎల్లుండిదాకా యెందుకూ! అనవసరంగా యిక్కడ. యేలాగో పోయేవాళ్లంగదా! యింకా ఆలస్యమెందుకూ!" అంది శ్యామసుందరి కోపంగా.

"అంత తొందర పనికిరాదే. రఘునాథం బావ యిస్తానన్న డబ్బు యింకా యివ్వలేదుగదా! అతను కూడా తప్పకుండా మనతోపాటు వస్తానన్నాడు. యింతకాలం అతనింట్లోవుండి, అతనిసొమ్ము మన సొమ్ముగా వాడుకొని బ్రతికినవాళ్లం, యీ రోజున మన అవసర నిమిత్తంగా తొందరపడి అతనిమాట లెక్కచేయకుండా వెళ్ళిపోతే ఏంబాగుంటుంది. అతని కెలావుంటుందో తెలుసా!" అంది సుందరమ్మ మమకారంగా.

రాగమయికి సుందరమ్మ అన్న మాటల్లో అబద్ధమేమీకనిపించలేదు. శ్యామసుందరి ఆ మాటల్ని ప్రస్తుతం విలువకట్టలేని స్థితిలోవుంది.

"రఘునాథం అంటే నీకు యిష్టంలేకపోతే లేకపోవచ్చు. కాని నాకుంది. నేనేం మూర్ఖురాలను కొన్నావా! మనకెంతో సహాయంచేసాడు. మనకింతకాలం ఆశ్రయంయిచ్చి కాపాడాడు. అయిన వాళ్లువున్నారని మురిసిపడ్డాం. అపవాదులపాలు కాకుండా ఆదరించాడు." అని సుందరమ్మ ఆగకుండా చెప్పకుపోతుంటే శ్యామసుందరికి ఉద్రేకం ఒక్కసారిగా పొంగివచ్చింది.

"రఘునాథం బావమీద నువ్వనుకొన్నట్లు హేయభావం యేమాత్రమూలేదు. అతను చాలా మంచివాడే. అతని వుపకారాలు నేను తెలుసుకోలేదనుకోకు. ప్రపంచమంతా రకరకాలుగా నన్నుగూర్చి విమర్శలు జరుపుతున్నా, తలెత్తుకొనే పంతులమ్మ చదువు పూర్తిచేసి వుద్యోగంచేస్తున్నా. పాప చదువు పూర్తిచేసింది. అతనివల్ల మనం నష్టపడిపోతున్నామని నేనను. రఘునాథం బావ యీ క్షణంలో వున్నట్లయితే నేనుపడే బాధను ముఖతావ్యక్తంచేసేదాన్ని. తేలవల్సిన విషయం అతనివల్లే తేల్చుకొనేదాన్ని. యేదియెలాగున్నా, బావ డబ్బు యిచ్చినా, యివ్వకపోయినా, ప్రయాణం మాత్రం తెల్లవారుఝామునే జరిగితీరవలిసిందే. ఎందుకు చెబుతున్నానో చెబుతున్నా. అంతగా వినాలనివుంటే రైల్లోనే చెబుతాను. యీ యింట్లో క్షాస్తకూడా బయటపెట్టను" శ్యామసుందరి మధ్య మధ్య దగ్గుతూ, రొప్పుతో

యిలా చెప్పడం సాగించింది. అక్కయ్య మాటలు వింటూంటే రాగమయికి వణుకు పుట్టింది. సుందరమ్మకు యేటూ తోచలేదు.

"ఊరుకోవే అక్కా" అంటూ రాగమయి, ఒకటి రెండుసార్లు దగ్గుతూంటే మంచినీళ్లు అందించింది శ్యామసుందరికి.

సుందరమ్మకు, శ్యామసుందరి అన్నమాటల్లోగల అర్థం మాచాయగా బోధపడినట్లు రాగమయి గ్రహించింది.

"అమ్మా! కావాలంటే ..." యిక రాగమయి చెప్పలేకపోయింది తరువాతిమాట.

"ఏమిటది ?" అంది సుందరమ్మ అక్కడికి.

"యేమిటా! యిదిగో చదువూ..." అంటూ శ్యామసుందరి తలదిండు క్రిందవున్న వుత్తరంముక్క సుందరమ్మవొళ్లోకి గిరాటు వేసింది.

రాగమయి సాంతం చదివి - "ఎంత కష్టంగా బావని యేడ్పిస్తున్నామో ఆలోచించు. యింత ఆస్తి వుండికూడా బావ సుఖపడలేకపోతున్నాడంటే యిదే బలమైన కారణం. అందుకే బావ యీ అపవాదులన్నిటిని భరాయించలేక మన కుటుంబాన్ని దూరంగా వుంచి, సాకుతామని ప్రయత్నిస్తున్నట్లు నాకు తెలిసిన పరిస్థితుల్లోనే, సమయానుకూలంగా అక్కయ్యకు జబ్బువచ్చింది. అందువల్ల బావ యీ నాడు మనల్ని దూరంచేసినా, అపవాదులేమీ అతనికి అంటురావు. మనంవుండి అతన్ని సుఖపెడ్తున్నాం అనుకొంటున్నాం. కాని నిజంగా అది లోకం దృష్టిలో ప్రతిరూపంలో వ్యతిరేకంగావుంది. అతను చేస్తానన్న సహాయం మన మొక్కడున్నా చేయకమానడు. తన నోటంట తాను వెళ్ళమని చెప్పలేక యెంతగా బాధపడుతున్నాడో! ఎవరికి తెలుసు. ఇటువంటి వుత్తరాలు అతనికి లోగడ యెన్నివచ్చి యేడిపిస్తున్నాయో! అందుకే యెప్పుడూ ఆలోచిస్తూ కూర్చుంటాడు. అతని స్థితిని యిప్పటికైనా గ్రహించగలిగాం కాబట్టే తొందరగా తప్పుకోవడం మంచిది. అందుకే అక్కయ్య తెల్లవారఝామునే వెళ్లిపోదామని పట్టుపట్టి కూర్చుంది." అని రాగమయి చెప్పటం ముగించి, శ్యామసుందరివంక చూసింది. శ్యామసుందరి యేదో చెప్పుదామనుకొంటూండగా దగ్గు తెర యీ సారి దీర్ఘంగా వచ్చింది. పొత్తికడుపులోని పేగులన్నీ ఒక్కసారిగా తెగి, పోగుబడ్డట్లుగా అయింది. కళ్ళవెంట నీరూరింది.

రాగమయి యీ లోపుగా మంచినీళ్లు తెచ్చిచ్చింది. గటగటమనితాగి తలదిండుమీద వాల్చింది.

సుందరమ్మ ఆ వుత్తరం అంతా చదువుకొని మరొక్కసారి, శ్యామసుందరి చెప్పినమాటల్లోను, రాగమయి అన్నమాటల్లోను అర్థంయేమీ తేడా లేదన్నట్లుగా నమ్మింది. కళ్లు చెమ్మగిల్లినయి.

ఏంచేస్తుంది ? ఎవర్నంటుంది ? రఘునాథం అంత పొద్దుపోయినా యింకా రాలేదు.

ఇదంతా జరిగేటప్పటికి తాలూకాఫీసులో రెండు గంటలు కొట్టారు.

## 6

ఇల్లు తాళం వేయబడి వుండటంచేత రఘునాథం ఆశ్చర్యపడి వెళ్ళిపోయారనుకొన్నాడు. కాని అంతలోకే మరో రకమైన ఆలోచన వూరింది. నేను కావలసిన పైకంకూడా యిస్తానన్నాను. అదైనా పుచ్చుకోకుండానే వెళ్ళిపోయారు. మర్నాడుగదా! ప్రయాణ మనేది. "ఆ అభిప్రాయంతో వుంటం వల్లనూ, ఎవరో కాకుండా మేనమామ వెంకట్రావు వస్తేనూ, అతనితో యేదో తెల్లవార్లూ మాట్లాడుకొంటూ వుంటం వల్లనూ రాత్రి రాకపోయేసరికి, మర్నాటికల్లా యింటికి తాళం వేసి వెళ్ళిపోతారా! ఇదంతా చూస్తే గమ్మత్తుగా వుందే!

"యిప్పటికైనా రఘునాథంకి సుందరమ్మంటే అసహ్యం పుడుతుందేమో! తాను చెప్పిన మాటలు కొంత వరకు ఒంట బట్టినట్లవుతయి" అని ప్రక్కన వున్న వెంకట్రావు ఆపోహ పడ్డాడు. అతను అంత దూరంనుండి కష్టపడి వచ్చిందందుకే అసలు, ఆ అభి

ప్రాయం కలిగిద్దామనే. కాని అటువంటిదేమీ రఘునాధానికి కల్గక పోయేసరికి వెంకట్రావు కెలా వుండాలి! ఒక్క మారుగా తానిటువంటి ఘన కార్యం చేయడానికి వచ్చానంటే యేం బాగు. అందుకే వెంకట్రావు హోటల్లో భోంచేసి రఘునాధం యింటికివచ్చి, అలా పోదాం రమ్మని తీసికొనిపోయి రాత్రల్లా ఆ దేవాలయం మండపంలో తిష్ఠవేయించి, అక్కడికే పరుపులు తెప్పించుకొని, యెట్టి పరిస్థితుల్లోనూ కదల నివ్వకుండా చేసి సుందరమ్మ సంసారాన్ని గురించి, ఆమె పిల్లల్ని గురించి, యింకా యేమేమిటో వున్నవి కొన్నీ లేనివి కొన్నీ నిద్ర చెడగొట్టి రఘునాధానికి నూరిపోశాడు. వినకుండా యెలా వుంటాడు రఘునాధం. వెంకట్రావు తన దృష్టిలో వింటున్నాడనే అనుకొంటాడు. వినిపించాలనేగా వచ్చింది వెంకట్రావు. రాక రాక మేనమామ వచ్చాడంటే రఘునాధానికి గౌరవంచూపుతున్నాననే వుంది. వెంకట్రావు మాత్రం చెప్పడం జరుగుతోంది గాని, అతను వింటున్నాడో, లేదో వెంకట్రావు కేం తెలుసు. మేనమామ చెప్పే మాటలకు విరుద్ధమైన హావ భావములు ప్రకటించకుండా, అనుకూలంగానే వుంటూ, ఆ రాత్రి యెలాగో గడిపేశారు. మర్నాడు యిద్దరూ కలిసి, యింటికివచ్చి చూస్తే యేముంది? సింహద్వారం తలుపులు రెండూ పెద్ద మంద్రగబ్బంత తాళంతో బంధించబడి వున్నాయి.

"తన మనస్సుని విఱగ్గొడదామని యెన్నో వుత్తరాలు వ్రాసిన మేనమామ వెంకట్రావు వచ్చి తనకూ-తన మేనత్త సంసారానికి విభేదాలు కల్పించి, ఆవిడ అవినీతి పరురాలిగా బ్రతుకుతూ వచ్చిందని, ఆమె పిల్లలయిన శ్యామసుందరి, రాగమయి కామేశ్వరరావుకి పుట్టలేదని, కావాలంటే ఆ పిల్లలకు - తల్లికి పదిమంది ఎదురుగా పోలికలు లేవని చూపుతానని, పూర్వం చేసిన యిటువంటి అవినీతికరమైన పనులు వెనుక నుంచుకొని, వాటిని కప్పిపెట్టుకుంటానికి నీ పంచజేరి కాలం వెళ్ళబుచ్చుతోందని, నీ మేలు కోరే ఆనాడలా వుత్తరం వ్రాసి, యీ రోజిలా బయలుదేరి వచ్చానని" మొదలు గాగల విషయాలన్నీ ఒక్క సారిగా గుర్తుకొచ్చేసరికి వెంకట్రావు మీద యీ క్షణం నుంచీ తనే విధంగానూ గౌరవ ముంచకూడదనీ, అసలతనంటే అభిమానం చూపకూడదనీ, అనుకున్నాడు రఘునాధం.

వెంకట్రావు ఆనాడు తనకోసం రాత్రిపూట వచ్చినప్పుడు రాగమయి ఎందుకో వంటయింట్లోకి వసారాలోంచి పరుగెత్తింది. అప్పుడు చూశాడు గాని, అంతగా పట్టించుకోలేదు. నేనైతే ఆ సమయంలో వెంకట్రావుని గురించి గ్రహించలేక పోయాను గాని, సుందరమ్మ, పిల్లలు యెందుకు గ్రహించకుండా పోతారు! అయినా వెంకట్రావు వచ్చాడన్నంత మాత్రంతోనే యిల్లు కాళీచేసి తాళంవేసి వెళ్ళిపోవాలా! ఎటువంటి బద్ధ వైరం వుంటేమాత్రం, కనీసం నే నొచ్చేంతవరకైనా వుండకుండా వెడతారా! యిస్తానన్న పైకాన్నికూడా లెక్ఖచేయకుండా సుందరమ్మ పిల్లలతో రైలెక్కింది."

రఘునాధంకి ఆలోచించడం బాగా అలవాటైంది. యీ అలవాటు రాను రాను విపరీతమైపోయింది. సమస్యలు యే విధంగానూ తెగడంలేదు. వెంకట్రావు యింతలో ప్రక్కన వుండి యేవో సణుగుతూనే వున్నాడు. కాని రఘునాధానికవేమీ వినిపించడం లేదు. ఎక్కడికి వెళ్ళిందీ యిధమిద్దంగా తేలడం లేదు. ప్రొద్దెక్కుతోంది. కడుపులో పేగులు అరుస్తున్నయి. నిస్సారత శరీరమంతా వ్యాపించుతోంది. వసారాలో రెండుమూడుసార్లు అటూ-యిటూపచార్లు చేసేటప్పటికి, ఒక కుర్రోడు తాళం చెవులు తెచ్చి యిచ్చి వెళ్ళాడు. రఘునాధం ఆ తాళం చేవుల వంక దీనంగా చూస్తూ, వెళ్ళి తాళం తీశాడు. రఘునాధం మాత్రం లోపలికి జొరపడ్డాడు. తర్వాత వెంకట్రావు వెడదామనుకొన్నాడు వెంట. కాని యెందుకో వూరుకున్నాడు. రఘునాధానికి యెన్నడూరాని కోపం హఠాత్తుగా కట్ట తెంచుకొని ముందు కురికింది.— గబాల్నన బయటికొచ్చి—

"సుఖ పడుతున్న కాపురానికి చిచ్చు పెట్టావయ్యా!" అన్నాడు.

వెంకట్రావు కొయ్యబారిపోయాడు. ఇలా అంటాడని అతనెప్పుడూ తల్చలేదు.

ఇల్లంతా కలయ చూశాడు రఘునాథం. యెక్కడ సామాను అక్కడేవుంది. గడియారం మాత్రం మేల్కొనివుంది. సుందరమ్మకు సంబంధించిన వస్తు సామాగ్రిమాత్రం కనిపించలేదు. యిల్లంతా రఘునాథాన్ని చూసి ఒక్కసారి బావురుమంది. రాగమయిని మొట్ట మొదటి సారిగా 'పాపా' అని పిల్చినచోటు కనిపించింది. అక్కడ రాగమయి రూపం నిర్జీవంగా కనిపించలేదు. తన పెట్టె దగ్గరకుపోయి చూశాడు. డబ్బు ఆ పాళానే వుంది. ఒక చిల్లి గవ్వకూడా పోలేదు. అంత మాత్రానికి రఘునాథం చిల్లికాని యెత్తుకూడా ఆనందపడలేదు.

"ఎవరికోసం యింత డబ్బు దాచి వుంచానో అది యీ రోజున వాళ్ల వుపయోగానికి వినియోగించలేక పోయాను." అని అంతరాత్మ పెదవి విరిచి మాట్లాడినట్లు పల్కింది. రఘునాథం ఒక్క నిముషం ఆ స్థలంలో ఆ సమయంలో వుండలేక పోయాడు. చరచరా బయటికి వచ్చేసి నుదురుమీద చెయ్యి పెటుకొని వెంకట్రావువంక చూస్తూ — "ఎంత పని చేశావయ్యా!" అన్నాడు. వెంకట్రావు "ఇదేమిటీ!" అని తెల్ల మొగం వేసాడు. కాని నోరు పెకల్లేదు. అతని ముఖం వంక అట్టే సేపుకూడా యిదివరకటి మాదిరిగా చూడలేకపోయాడు. రఘునాథంకి హృదయాంతరాళంలోంచి పొంగివచ్చే అవ్యక్తమైన సంగతుల్ని నోరుమూసుకొని, బిగపట్టి ఒక చోట చతికిల పడ్డాడు. ఎంత సేపటికీ ఒక నిశ్చితాభిప్రాయాన్ని సూచించే సమాధానం రఘునాథం నుండి రాకపోయేటప్పటికి, అటూ — యిటూ పరకాయించి చూసి, నెమ్మదిగా లేచి —"అయితే... వెళ్లొస్తాను... కంపెనీ బస్సుకూడా వచ్చే వేళయినట్లుంది... అయిన వాణ్ణిగదా అని యేదో తోచింది చెప్పి పోదామని వచ్చాను. అంతే ... నువ్వా వ్యక్తత వచ్చినాడవే. మిగతా భారమంతా నీకే వొదిలి వెడుతున్నాను. తరచు వుత్తరాలు వ్రాస్తూవుండు..." అంటూ వీధిలోకి వెళ్ళబోతుండగా, రఘునాథంకి కొన్ని అసంపూర్ణ ఆలోచనల్లోంచి మెలకువ వచ్చి "చాలా సంతోషం. వెళ్ళిరా మామయ్యా!" అందామనుకొన్నాడు వ్యంగ్యంగా. కాని మనసొప్పలేదు. అయినా బదులు చెప్పవలసిన బాధ్యత తనకుందిగా! అనే భావంతో "మంచిది" అని సూక్ష్మంగా అన్నాడు.

వెంకట్రావు గొడుగు చంకన బెట్టుకొని రఘునాథం అన్నమాట వినట్లో, వినిపించుకొన్నట్లో, వెనక్కి కూడా తిరక్కుండానే వెళ్లిపోయాడు.

గాలికి వీధి తలుపులు దభేలుమని దగ్గరకు కలుసుకొన్నాయి.

రఘునాథం ఒక నిట్టూర్పు బరువుగా వొదిలాడు. బిగపట్టి లాగి వొదిలిన కొబ్బరి మట్ట రివ్వునపోయి మరొక మట్టకు తగలగా, స్వాతంత్ర్యం వచ్చిందని కొబ్బరాకులు కిల కిల మని నవ్వినట్లు ఒక శబ్దం సుకుమారంగా వినిపించింది. రఘునాథం చొక్కా గుండీలు వొదులు చేసుకొని, గుండెమీద పట్టిన చిరు చెమటకు గాలి సూదాడు.

## 7

సుందరమ్మ కుటుంబం వేరుగా బ్రతుకుతోందని చుట్టాల్లోకి బాగా పాకిపోయింది. కొందరా విషయానికి విశ్రాంతి తీసుకొంటున్నట్లుగా భావించారు. కొందరికి జాలివేసి, సానుభూతి చూపుదామనుకొన్నారు. అయితే రఘునాథంమీద యెక్కువ అపనిందలు మోపపడలేదు. చాటు చాటుగా అనుకొంటూనే వున్నారు. "వాడెందుకు వూరుకొంటాడు. రాగమయి మీద మనసుని యీనాడు పోగొట్టుకొమంటే పోగొట్టుకుంటాడా! సుందరమ్మ వాడికి మత్తు మందు పెట్టి మనసు మార్చి వేసింది. ఏ విధంగానైనా వాళ్ళకు సాయం సేయక మానడు."—అని.

శ్యామసుందరి క్షయాసుపత్రిలో చికిత్స పొందుతోంది. రాగమయి, సుందరమ్మ వేరుగా ఒక చిన్న గది అద్దకు తీసుకొని కాలక్షేపం చేస్తున్నారు.

కామేశ్వరావు బ్రతికివున్న రోజుల్లో కష్టార్జితంమీద చేయించుకొన్న నగలన్నీ క్రమేపీ మార్వాడీ కొట్ల మీదకు వెళ్ళిపోతున్నాయి. మొదట్లో రాగమయి ఖాళీగానే వుంటూ వచ్చింది. కొన్నాళ్ళవరకు యిలా వుండగా ఒకనాడు రాగమయి బజారుకుపోయి శ్యామసుందరికి బత్తాయిలు, నారింజలు కొని తీసికెళ్ళివ్వడానికి ఆస్పత్రికి వెళ్లింది. డాక్టరు కృష్ణమోహన్‌తో శ్యామసుందరి యేవో జీవిత సంఘటనల్ని చెబుతోంది కృష్ణమోహన్ "ఊ" కొడుతూ వింటున్నాడు. రాగమయి రావడం కృష్ణమోహన్ చూసి, శ్యామసుందరితో — "మీ చెల్లాయి వచ్చిందన్నాడు."

"ఇలా రావే పాపా" అంది శ్యామసుందరి.

"అయితే ఆ పండ్లు రసం తీసి పుచ్చుకొంటూరు గదూ !" అంటూ కృష్ణమోహన్ వెళ్ళిపోయాడు. రాగమయివచ్చి శ్యామసుందరి దగ్గరగా కూర్చొని "రసం తీసి యివ్వనా ?" అంది. "ఇప్పుడొద్దులే ! కాసేపు వుండు" అంది శ్యామసుందరి. రాగమయిని చూస్తే శ్యామసుందరికి యెందుకో ! కళ్లవెంట నీళ్లు పారినయి. "ఎందుకక్కా ! యేడుస్తున్నావ్" అంది. "అబ్బే ! యేం లేదే ! యేదో జ్ఞాపకం వచ్చింది. అంతే... నిజంగా డాక్టరుగారు యెంత మంచివారనుకొన్నావ్. యీ సీసా యివాళ ఆయనే కొనిచ్చారు. నే నింత ఖరీదు గలది కొనుక్కోలేనండీ అంటే అమ్మకి చెప్పు యీ రోజునుంచి క్రొత్తమందు మొదలుపెట్టారని" అంటూ శ్యామసుందరి చెప్పుకొస్తుండగా రాగమయి, యింటికి వెళ్ళడానికి లేచింది. "చెల్లాయి ! వూరికే కూర్చోపోతే నలుగురైదుగురాడ పిల్లలకు ప్రయివేటు చెప్పకబోయావా !" అంది.

రాగమయికి యీ ఆలోచన రఘునాథం యింటి వద్దనుండి బయలుదేరి, తెల్లారు ఝామున రైల్లో వస్తూండగానే తట్టింది. కాని, పరిస్థితులు ఒక విధంగా స్థిరపడితేనేగాని, యిటువంటి పనులకు వీలు దొరకదని ఆగి వూరుకొంది. యిప్పుడు శ్యామసుందరి ఆ విషయం గురించి అనంగానే, రాగమయికి తళుక్కున మెరిసింది. వెంటనే "సరే అక్కయ్యా ! నేనూ యిలా చేద్దామనే లోగడ అనుకొన్నాను." అంటూ నెమ్మదిగా శ్యామసుందరి విడిచిన బట్టల్ని సంచిలో పెట్టుకొని యింటికి దారి తీసింది.

శ్యామసుందరికి రాగమయి చేయబోతున్న కార్యం తెల్సుకొని సంతోషపడింది. డాక్టరు కృష్ణమోహన్‌కి కూడా ఆనాడే తెల్పింది. యిద్దరూ వాళ్ళకళ్లో కళ్ళు మొగాలు చూసుకుని నవ్వుకొన్నారు. రాగమయి యింటికివచ్చి సుందరమ్మతో తాను చేయబోయే విషయం గురించి చెప్పగానే గడిచిన జీవితాన్ని స్మృతికి తెచ్చుకొని కంట నీరెట్టుకొంది. రాగమయి వెలగా మారిపోయి—

"వూరుకోమ్మా ! అన్నీ తెలిసినదానివికూడా యిల్లా అయితే యింకేమిటి ?" అంది.

(సశేషము)

# సిరిసిరిమువ్వలు

'వారపీచు'

"మేరీ! అమ్మను, నాన్నను, తాతయ్యను రక్షించి ఆశీర్వదించమని భగవంతుని ప్రార్థించావుకాని అత్తయ్యను కూడ ఆశీర్వదించవలసినదిగా ఎందుకమ్మా ప్రార్థన చెయ్యలేదు?"

"మొదట అలాగే అనుకున్నానమ్మా! కాని అందరిని ఆశీర్వదించవలసినదిగా ఒకే సారి భగవంతుని ప్రార్థిస్తే మర్యాదగా నుండదనిపించింది."

♦ ♦ ♦

ఒక బాలుడు తన ఫౌంటెన్ కలము పోయిందని ఏడుస్తూవచ్చి తండ్రితో చెప్పాడు.

"నిజంగా పోయిందా?"

"అవును నాన్నా! నా జేబులోని కలాన్ని అదే పనిగా చూస్తుండిన మనుష్యుని చూచాను."

♦ ♦ ♦

ఒక యువకుడు తమ యింటిప్రక్కనున్న సంపన్న గృహంలోని వితంతువును వివాహమాడదలచి తన కోర్కెను తెలియజేశాడు.

ఆమె "బాగుంది - అయితే నాకు, మీ యింటి ప్రక్కనున్న గేదెకుగల భేదమేమిటో చెప్పండి" అన్నది.

సహజంగా అతడు "నాకు తెలియదు" అన్నాడు.

"అలాగైతే దానినే వివాహమాడటం మంచిది."

♦ ♦ ♦

ఒక యింటి దొడ్డిలో చెట్టెక్కి దొంగతనంగా జామకాయలు కోసిన ఒక బాలుని యింటి యజమాని పోలీసుకు ఒప్పగించాడు. కోర్టులో విచారణచేసి న్యాయమూర్తి మొదటి నేరంక్రింద క్షమించి "ఇకముందెప్పుడు యిటువంటి దొంగ పనులు చేయబోకు - ఏదో యీ సారికి తప్పించుకున్నావు" అన్నాడు విడుదల చేయిస్తూ.

"నేనింతకుముందే తప్పించుకునేవాడిని-తోటవాడు గోడఎక్కి దూకేటప్పుడు పట్టుకోకుండా యున్నట్లయితే."

♦ ♦ ♦

ఒక యువతి చేత నొక ఫొటోగ్రాఫ్‌తో పోలీసు స్టేషనులో ప్రవేశించి. "నన్ను

అన్యాయంచేసి నాభర్త పరారై పోయాడు. ఇదుగో—అతనిఫొటో నాధారం చేసికొని దయయుంచి వెదకిపెట్టాలి'' అన్నది కండ్లనీళ్లపర్యంతముగా.

ఇన్స్పెక్టరు ఫొటోను క్రిందినుండి పైదాక ఒకసారిచూచి కనుబొమలను ఎగ బీకుతూ ''ఎందుకూ!...'' అన్నాడు.

♦ ♦ ♦

ఒక యువతిని గట్టిగా కౌగిలించుకొని కాంగానే ''నేను నిర్మొగమాటంగా ఒక విషయం చెప్పదలచుకున్నాను; నేను ప్రేమించినవారిలో నీవు మొదటిదానివి మాత్రంకావు'' అన్నాడు ఒక ఆంగ్ల యువకుడు.

''నేను అదే చెప్పబోతున్నా - నీవింకా నేర్చుకోవలసినది చాల యున్నది'' అన్నదా యువతి.

♦ ♦ ♦

ఒక రోగినిచూచి చికిత్సచేయడానికి డాక్టరు పిలుచుకొని రాబడ్డాడు.

డాక్టరు ''ఏమిటండీ మీకు జబ్బు - ఎలాగుంది ఒంట్లో'' అంటూ స్టెతస్కోపు సవరించుకోసాగాడు.

''దాన్ని కనిపెట్టవలసినవారు, చెప్ప వలసినవారు మీరు'' అన్నాడా రోగి వికటంగా.

''అయితే ఒక గంట వ్యవధివ్వండి - మా మిత్రుడొకడు పశువులకు వైద్యం చేస్తుంటాడు. వాడైతే ఎలాటి ప్రశ్నలు వేయకుండా వ్యాధి నిర్ణయంచేయగలడు'' అన్నాడు డాక్టరు.

(592-వ పేజి తరువాయి)

మారాయి. స్నేహితుని హృదయం భేదానికి అర్థం చెబుతోంది. పేద పెన్నిధుల తారతమ్యాన్ని కొలత బద్దతో కొలచి చూపిస్తోంది.

అతని దగ్గరకు వెళ్లడానికి మనస్కరించలేదు. వెళ్లకపోతేయెట్లా! అవసరం-వెళ్ళాలి. ప్రయత్నం చేయకుంవల్ల నష్టమేముంది? మెట్లు గబగబా ఎక్కిపోయాడు. కుక్క బొంయ్‌మని అరవడం మొదలు పెట్టింది. అతడు క్రిందకు దిగిపోయి, జాలిగా కుక్క కళ్లలోనికి చూస్తున్నాడు. చివరకు జంతువులకు కూడా తనమీద జాలిలేనట్లు ఫీలవుతున్నాడు. క్రింద నుంచి చాలసార్లు పిలిచాడు. బలం కొలది అరచాడు. సమాధానంలేదు.

కాస్సేపటిలో బయట కారొకటి ఆగింది. కారు లోనుంచి వస్తున్న స్నేహితుడ్ని గుర్తుపట్టాడు పిల్చాడు. మిత్రుడు రాలేదు, అతడే స్నేహితుని వద్దకు వెళ్ళాడు.

చాల అవసరం... "ఒక పదహేను రూపాయలు వుంటే యివ్వు. ఒకటవ తారీఖున ఇచ్చేస్తాను" స్నేహితుని వైపు చూశాడు.

"అరరె! ఇప్పుడే వంద రూపాయలు పేకాట ఆడేశాను. నా దగ్గరేమిలేదు. సారీ!" జేబులో వుంచుకునే, అతి తేలిగ్గా అబద్ధం ఆడేశాడు. అబద్ధం జన్మస్థానం డబ్బు దగ్గరని అర్థమయింది. కిక్కురు మనకుండా అచ్చటనుంచి వెళ్ళిపోయాడు.

విచార వదనంతో ఇంటికి చేరుకున్నాడు. తలుపులు దగ్గరగా వేసివున్నాయి. తలుపులను తోసి లోపలికి కాలు పెట్టాడు. గుమ్మం దగ్గర గోడ నానుకొని చాపమీద కుసుమ కూర్చునివుంది. ఒడిలో తల పెట్టుకొని, పాప నిద్రపోతోంది. మధు గదిలో నిద్రపోతున్నాడు. ఇనుప కొక్కానికి తగిలించిన హరికేన్ లాంతరు కిరసనాయిలు లేక మినుకు మినుకు మంటోంది, చావు బ్రతుకుల మధ్య చెరలాడే ప్రాణి లాగ. కుసుమ మెల్లిగా పాప తలను తీసి దిండు మీద పెట్టి, లాంతరు దగ్గరకు వచ్చి వత్తిను పెద్దది చేసింది. వెంకటేశ్వర్రావు ఎదురుగుండా కన్పించాడు, తలంతా రేగిపోయివుంది. తల వెంద్రుకలు కళ్ళద్దాల మీద చిందర వందరగా పడివున్నాయి. కళ్ళద్దాలను తీసి, దండానికి తగిలించిన తువాలుతో శుభ్రంగా తుడిచి, కళ్ళల్లో పడుతున్న వెంద్రుకలను పైకెగ దోసి, కళ్ళద్దాలను పెట్టుకున్నాడు. మడిచి వున్న మడత మంచాన్ని వాల్చి, మంచంమీద వత్తిగిల్లాడు. కుసుమ దగ్గరగావచ్చి నిలబడింది.

"బాబు నిద్రపోయాడా?" మెల్లగా అడిగాడు.

"మీరు వస్తారని చాల సేపటివరకు చూచి, ఇప్పుడే నిద్రపోయాడు."

"బట్టలకోసం కూర్చున్నాడా?"

"పిల్లలు ఏది పట్టిస్తే అది. వాడేదో కొనమన్నాడని, డబ్బులేదని మీరు బాధ పడటం దేనికి? వాడికి నర్ది చెప్పకూడదు?"

"నోరు ఎండిపోయింది. ముందు కాసిని చల్లని నీళ్లు తెచ్చిపెట్టు."

కుసుమ గ్లాసుతో మంచినీళ్లు తీసుకొనివచ్చి, వెంకటేశ్వర్రావు కిచ్చింది. గడగడ మంచినీళ్లు త్రాగుతూ ఆమె వాక చూశాడు.

"ఎంత ప్రయత్నించినా లాభంలేదు." ఖాళీ చేసిన గ్లాసును నేలమీద పెట్టాడు.

"వాళ్లగురించి అనవసరంగా బాధపడుతున్నారు." దుప్పటి దిండు తీసుకొనివచ్చింది.

"ఒక్కసారి లేవండి. పక్క వేస్తాను" వెంకటేశ్వర్రావు లేచి నిలబడ్డాడు. దుప్పటి దులిపి, మంచంమీద పరచి, తలదగ్గర దిండు పెట్టింది.

"తిరిగి తిరిగి వచ్చారు. నిద్రపోండి." కుసుమ అచ్చటనుంచి వెళ్లి పోయింది.

"కుసుమా!"

కుసుమ వెనక్కి తిరిగి, దగ్గరగా వచ్చింది.

"కుసుమా! రేపు పండగకదూ!" ఆమెను దగ్గరగా తీసుకొని, విశాల నయనాలలోనికి తొంగి చూశాడు.

"మీరు మరీ చిన్న పిల్లలయిపోతున్నారు. రేపు పండగని మీకు కొత్త బట్టలు కుట్టించాలా?"

"కుట్టిస్తావా?"

"పెళ్ళినాడు ప్రధానానికిచ్చిన లైటు సిమెంటు కలరు చీర చించి కమీజు కుట్టించ మంటారా?" నవ్వుతూ అతని బుగ్గలను పొడుగాటి వ్రేళ్ళతో రాస్తూ, చిలిపిగా అతని కళ్ళల్లోకి చూస్తుండిపోయింది,

"ఇంకా నయం! నీ చీరలను కట్టుకోమన్నావు కాదు."

"చాల పొద్దుపోయింది. నిద్రపోండి."

"నిద్ర పడుతుందా?"

"కొత్త బట్టలు కుట్టించలేక పోయేరని మీరు నాకు ధైర్యం చెప్పవలసింది బదులు మీకు నేను ధైర్యం చెప్పవలసి వచ్చింది. డబ్బుకి ఇబ్బందిగా ఉన్నప్పుడు ఆశలను చంపుకోవాలి. వాళ్ళకు బట్టలు లేనంత మాత్రంలో పండగ ఆగిపోదుగదా?"

"చిన్న పిల్లల బాధ నీకేమి అర్థమవుతుందే!"

"అక్కడకు మీరు కన్నట్లు మాట్లాడతారేం! జీవితంలో బాధను పంచుకునేది భార్యా భర్తలకు సమానమేగా!"

"సరేగాని, రేపు బాబుకి సమాధానం చెప్పే దెట్లా?"

"నేను చెప్తాను. మీరు నిద్రపొండి." అతని కౌగిలినుంచి విడిపోయి, అచ్చటనుంచి వెళ్లి చాప మీద నడుం వాల్చింది.

ఎప్పుడు చీకటి పోయిందో, ఎప్పుడు తెల్లవారి పోయిందోగాని, లోకం కళ్లు తెరచి కార్యక్రమంలో మునిగింది. సూర్య కిరణాలు కిటికీలోనుంచి దూసుకొనివచ్చి, వేడిగా శరీరాన్ని తాకుతున్నా, వెంకటేశ్వర్రావు కదల్లేదు. ఇంకా నిద్రపోతూనే ఉన్నాడు. మధు, పాప తండ్రి లేస్తాడని ఎదురు చూస్తూ నిలబడ్డారు. అతడు లేచేసరికి ఏడయింది. ఎదురుగుండా నిలబడివున్న మధు పాపలను చూచి దిగ్భ్రాంతి జెందాడు.

"మంచి చొక్కా కొన్నావు చాల బావుంది," సంతోషం పట్టలేక ఎగిరి గంతేస్తున్నాడు మధు.

"నా బట్టలుకూడా చక్కగా వున్నాయి." తండ్రి దగ్గరకువచ్చి, మంచంమీద కూర్చుంది పాప.

వెంకటేశ్వర్రావుకంతా అయోమయంగా ఉంది. కల గంటున్నాడేమో అన్పించింది. బట్టలు 'యెట్లాగ వచ్చాయి? ఎవరు కుట్టించారు?? డబ్బెక్కడ్నుంచి వచ్చింది??? తనలో తాను ప్రశ్నలు వేసుకుంటున్నాడు. సమాధానాలు రావడంలేదు.

"నాన్నా బడికి వెళ్తాం!" మధు పాపను వెంట పెట్టుకొని వెళ్ళిపోయాడు. వెంకటేశ్వర్రావు పొయి దగ్గర కూర్చున్న భార్య దగ్గరకు వచ్చి నిలబడ్డాడు. కుసుమ వెనక్కి తిరిగి చూచింది.

"ఊరంతా పండగ సందడితో కల కలలాడుతోంది. మొహం కడుక్కొని రండి. వేడి వేడి పెసరెట్లు మీకోసం ఎదురుచూస్తున్నాయి."

"కుసుమా! నీటిలో చార, స్త్రీ హృదయంలో జాడ తెలుసుకోలేమంటారు. నిజమేనా?"

"ఇంత ప్రొద్దున్నే మీ కంత పెద్ద ధర్మసందేహం ఎట్లాగ వచ్చింది?"

"వాళ్లకు కొత్త బట్టలు ఎట్లాగ వచ్చాయి."

"మీరు కొనిపెట్టారటగా..."

"ఇది మరీ బావుంది. పండగ పూట అబద్ధం దేనికి?"

"అబద్ధాలు చెప్పడం ఆడవాళ్లకు అలవాటని మీరే అంటారుగా?"

"వేళాకోళాలు తర్వాత. ముందు త్వరగా చెప్పు!" కోపంతో అన్నాడు.

కుసుమ అతని కోపాన్ని కనిపెట్టింది.

"నీ ప్రయత్నంవల్ల నన్ను బాధ పెట్టాలనే ఉద్దేశ్యం నీకు లేకపోవచ్చును. కాని..." శాంతంగా తిరిగి తనే అన్నాడు.

"తర్వాత మాటలు చెప్పి నన్ను కష్ట పెట్టకండి. తీరిక సమయాల్లో, నూలువడికి, లేసులల్లి, ఇస్త్రర్లు కుట్టి కొంత డబ్బు సంపాదించాను. ఆ డబ్బుతో పిల్లలకు బట్టలు తీసుకున్నాను."

"ఆ సంగతి ముందే ఎందుకు చెప్పలేదు. నా అప్రయోజకత్వాన్ని నాకే చూపించడానికా!"

"అంతంత మాటలు అనకండి. మీరు వేళ్లేముందు చెప్పలేనందుకు బాధ పడుతున్నాను. మీ రీ విధముగా అనుకుంటే నన్ను క్షమించండి. ఇటువంటి పనులెప్పుడూ తలపెట్టను." జాలిగా బాధగా భర్త వంక చూచింది.

ఆమె చూపుల్లో...

అవ్యాజమైన అనుబంధం

అనూహ్యమైన అభిమానం...

అతనికి అందాయి.

"పండగంతా మన ఇంట్లోనే ఊరేగుతుందను కుంటాను. నవ్వుతూ మాటమార్చాడు. భర్తకోపం చల్లారిందని కుసుమ మనసు తేలిక బడింది.

"మన ఒక్కరికే కాదుగా ఈ పండగ భారత దేశంలో ప్రతి ఇంటింట చేసుకోవలసిందే! ఎవరికి వున్న దాంట్లో వాళ్ళు పండగ చేసుకోకుండా మానరు."

"అయితే మధ్యాహ్నం పిండివంటలు ఏం చేస్తున్నావు."

"బిరంజీ చేస్తున్నాను. గారెలు మీ కిష్టంగా... అవి కూడా చేస్తున్నాను"

"బ్రహ్మాండంగా ఉంది. కుసుమా దేవికి జై!!"

"వసంతాలు నిండిన అల్లరి పోలేదు."

"నీబోటి ఇల్లాలు వుంటే కర్ర చేతికి వచ్చినా అల్లరిపోదు."

వెంకటేశ్వర్రావు మొహం కడుక్కొనివచ్చి, వేడి వేడి పెసరెట్లు ఆరగించి, మూతిని భార్య పమిట చెంగుతో తుడుచుకొని, నిలబడ్డాడు.

"నిజమైన పండగనిపించావు. నీబోటి ఇల్లాలు వుంటే ఆ ఇంట్లో రోజూ పండగే!"

అంటూ బయటకు బయలుదేరాడు...

# మేఘ బాలిక

"శాంతిశ్రీ"

—(o)—

వినీల నిర్మల వియత్తలమ్మున
సవితృపాదం స్పృశించుకొంటూ
ఉల్లాసంతో విన్యాసంతో
కదంత్రొక్కుతూ పదంపాడుతూ
పరుగులుతీసే మేఘబాలికా !
ఎక్కడికమ్మా నీ పయనం ?
చెబుదూవింటా నీ కథనం—

కుమిలే జీవుల హృదయంలో
కదిలే ఆశల మ్రోడులలో
బంగరు కాంతులు వెదజల్లి
ముసిముసి రేఖలు మెరిపించి
తొలకరివానలు రప్పించి
ఉరుములు మెరుపులు గుప్పించి
ఎక్కడికమ్మా నీ పయనం ?
చెబుదూవింటా నీ కథనం—

ప్రియబాంధవి ప్రణయంకోసం
ప్రణమిల్లిన భక్తుల త్యాగంలో
ఆశలు తీగలు సాగంగా
తీగలు పూవులు పూయంగా
పూవులు కాయలు కాయంగా
సందేశాలను విందులు జేసి
ఎక్కడికమ్మా నీ పయనం ?
చెబుదూ వింటా నీ కథనం—

చీకటిక్రమ్మిన ధారుణిలో
బీటలువారిన వాకిటిలో
శిలలై పగిలిన హృదయంలో
పచ్చని వెచ్చని పరుపులువేసి
చల్లటి తీయటి జలాలు తడిపి
తరగని కరగని సపర్యచేసి
ఎక్కడికమ్మా నీ పయనం ?
చెబుదూవింటా నీ కథనం—

ఇంతఓర్పు ఇంతనేర్పు
ఇంతజలం ఇంతబలం
ఎక్కడిదో నీ కెక్కడిదో
జనికంతా సౌఖ్యాన్నిచ్చే
మేఘబాలికా శాంతిదాయకా
ఎక్కడికమ్మా నీ పయనం ?
చెబుదూ వింటా నీ కథనం—

—(o)—

# జీవన యాత్ర

శ్రీమతి ఎన్. మంగాదేవి

నిరాశతో, నిస్పృహతో
నిర్జీవంగా, నిరామయంగా
పయనిస్తావెందుకు?
నీరదాకాశంలో
పయనించే జాబిలిలా
చీకటికోణంలో

ప్రసరించే వెలుగు కిరణంలా
అలా అలా ముందుకు
మున్ముందుకు
గతాన్ని మరచి
కష్టాల్నితరచి
సుఖాన్ని తలచి
పయనించాలిగా మరి!
మనిషిలో విలువ
మనసులో కలత
గుర్తించే, గమనించే
మనసుగల మనుషులు
మనుష్యుల్లో మనుషులు
ఉంటారు కొందరైనా
యిస్తారు చేయూతనైనా
అదిగో అదే
ఆ కన్పించేదే
నీవాశించే
ఉదయకాంతి
అరుణ కిరణ ప్రభాజ్యోతి
నిర్మలత్వంలో
నిండు హృదయంలో
అంజలి ఘటించి
నీరాజనా లర్పించు
నిరాశని, నిస్పృహని
నిర్జీవాన్ని, నిరామయాన్ని
నీ రదాకాశంలో
చీకటి కోణంలో
అక్కడే ఎక్కడో
విడిచేసి, వదిలేసి
జాబిలిలా, వెలుగు కిరణంలా
భావికి పురోగమించాలి
గతాన్ని విస్మరించాలి.

---

## దేశవాళి కూరగాయలలో విటమినులు

దేశవాళీ కూరగాయలలోగల విటమినుపదార్థాలను గురించి న్యూఢిల్లీలోని లేడీ ఇర్విన్ కళాశాలకు చెందిన డాక్టర్ కుమారి పూరీ పరిశోధనలు సాగించారు. ఫలితంగా మెంతి, పుదీనా, ఆవ చిక్కుళ్లు, బచ్చలి ఆకులలో, 'సి' విటమినులూ, అనుము, కాల్షియం, భాస్వరం మొదలైన సుపోషకత్వ పదార్థాలున్నాయనీ తేలింది. వంకాయలూ, ధనియాలూ, ఉల్లిపాయలూ, చిరగడ దుంపలూ, బటాణీలూ, కాబేజీ, కాలిఫ్లవరూ, ఉసిరికాయలూ, అపిల్ పండ్లలోకూడా విటమిను పదార్థాలు ఉన్నాయని కనుగొనబడింది. రక్తపుపోటు, గుండె జబ్బులకు విటమిను 'సి' మంచి పని చేస్తుంది.

# స్త్రీ ధర్మము

మూలము :

"భూమండలేశ్వర" స్వామి శివానంద సరస్వతీజీ మహారాజ్

అనువాదము :

"శివానందపాదసేవక్" స్వామి శ్రీనివాసానంద సరస్వతి

(గతసంచిక తరువాయి)



స్త్రీలు కొన్ని యిబ్బందుల కల్గియుందురు. కాననే వివిధములగు కష్టములచే చుట్టి ముట్టబడు నీ మార్గము త్రొక్కుటకు వారు బాధను కనుగొందురు. వారు ప్రతిబంధకములు లేనిచో, వారు దృఢ సంకల్పము, సహన శక్తి, మంచి యారోగ్యము, బలముల కలిగి యుండుచో, వారు విరక్త జీవనమును గడుప తీవ్రేచ్ఛ గలిగియుండుచో వారుకూడ నీ పంథాను గైకొన వగును. వారీ పంథాను ప్రవేశించు ముందఱ తమ యింద్రియముల నదుపులో నుంచుకొని తమంతట తాము తయారుగావలెను. సక్రమముగ తీర్చి దిద్దబడు ముందు వారొకరి క్రింద నిలచియుండవలయును. హిందూదేశమున స్త్రీల కొఱకై నాశ్రమములు గలవు. లేదా నత్యమితముగ నభివృద్ధి గాంచిన జ్ఞానులుండునట్టి యే యాశ్రమముననైన వారు నిలచి తీవ్ర స్వాధ్యాయము (పారాయణ) సాధనల నొనర్పనగును. స్త్రీల తర్ఫీదు చేయుట కగు సంస్థలు ప్రస్తుత సమయ తీవ్రావశ్యకతమైయున్నది.

## యౌగిక వ్యాయామములు

ఆరోగ్య సంరక్షణ నియమములు ప్రపథమ తొల్దొల్తటి యోచనను గొనవలెను. ఆరోగ్య నియమములు, ప్రకృతి నియమములు శిక్షలేకుండ నుల్లంఘింపబడ జాలవు. నియమముల తృణీకరించువారు కుదరరాని రోగములకు బలులై (victims) సంతస రహితమైన జీవితము నీడ్చుచుందురు.

ప్రపంచమున నుత్తమారోగ్యముగల తల్లులు, ఆరోగ్యవంత, దృఢకాయులగు బాల బాలికలు కావలసియున్నది. హిందూ దేశములో నీరోజులలో మనముగనునదేమి - భీష్మ, భీమ, అర్జున, ద్రోణ, అశ్వత్థామ, కృప పరశురామ యింకను తదితరన సంఖ్యాక శౌర్యవంత యోధుల నుత్పత్తిచేసిన భూమి, నిర్భీత సాహసము, నసమాన పరాక్రమము, సాటిలేని బలములతో గూడిన లెక్కలేనన్ని యుద్ధ ప్రముఖుల గల్గిన పుడమియగు భారతదేశ మిప్పుడు పిరికి పందలు నిర్వీర్యులగు బలహీనులతో నిండియున్నది.

స్త్రీలకు క్రమ వ్యాయామ మొక యావశ్యకత. హిందూ దేశములోని బాలికల యారోగ్యమే యితర దేశపుటారోగ్య ప్రమాణము (Standard) కంటెను తక్కువయే. వ్యాయామ లోపము మూలమున, బాలికలు సక్రమముగ నెదుగరు. వారు పాండురోగము Anaemia) లేదా రక్తలోపము, నిస్సత్తువ, బంధింపబడిన పెరుగుదలల (arrested developments) చే బాధ నొందుదురు. జాతి (వంశము) ని కొనసాగింపవలసిన భారము వారి భుజములపై గలదు. కాన దృఢకాయము, బల, శక్తుల నున్నత ప్రమాణమును (Standard) వారు విధిగ కలిగియుండ వలయును.

వారు సర్వాంగ, భుజంగ, శలభ ధనుర, పశ్చిమోత్తానములవంటి కొన్ని సులభాసనములను, ప్రాణాయామాభ్యాస క్రియల తప్పనిసరిగ నభ్యసింప వలెను. లాట్వియా, జర్మనీ, ఫ్రాంసు యింకా నితర విదేశములలోకూడ స్త్రీలు యోగాభ్యాస క్రియలలో నమిత శ్రద్ధను గొనుటను గమనించు టత్యమిత సంతృప్తి కరమైనది. ఎన్నడును విశ్రాంతిగొనజాలని స్త్రీ తన సౌందర్యము నొందదు. ఆమె ముఖ, శరీరములు అనుభవించుచున్న బడలికయొక్క చిహ్నముల కనబఱచును. ఆమె యొడలు సరిసమత్వ (pose) లోపము గల్గియుండును. ఉదయమున, మధ్యాహ్నమున, సాయంత్రమున నథమము పది నిముషముల పాటు సంపూర్తిగ విశ్రాంతి గొనుడు. కండ్లు మూసుకొనుడు. మీ మనస్సును శూన్యముగ నుండ నిండు. దేహ విశ్రాంతి శరీరమునకును, మనస్సునకును గూడ హాయి (సుఖము)ను దెచ్చును. విశ్రాంతి యెవరికైన సంపూర్తిగ సేద తీర్చును.

ధన్యతల్లులారా! సీతయొక్క సరళత్వము, పవిత్రతలలో బెరుగుడు. మీ హృదయమున భక్తియనెడి దీపమును వెలిగింపుడు. ఆదర్శ స్త్రీలు కండు. సీత ఆత్మయొక్క నాంతర్య సౌందర్యమున ధనవంతమైనది. పవిత్రత, భక్తిద్వారా వాడిపోవని సౌందర్యము నొందుడు.

మిమ్ముల నందఱ సేవించుటకై నే జీవింతును. మిమ్ముల నందఱ సౌఖ్యవంత మొనర్చుటకై నేను జీవింతును. అజ్ఞానము నశింప చేయుటలో జీవిత గమ్యమగు, నంతిమానందమగు కైవల్య మొందుటలో మీ కందఱకు సహాయ మొనర్చుటకై నే జీవింతును.

మీ యందఱిలోని దివ్యజ్యోతి ప్రకాశవంతముగ పెంపొందుగాక! మీ పాతివ్రత్య ప్రభతోడ విరాజమాన మగుదురుగాక? తల్లులు ధర్మ మార్గమును త్రొక్కి- భగవత్సాక్షాత్కార మొందురుగాక! ప్రపంచ మాదర్శ స్త్రీలు, బ్రహ్మచారిణులు, బ్రహ్మవాదినులతోడ పూరింపబడుగాక!

సర్వేషాం మంగళం భవతు!

మీ యందఱకు కళ్యాణమగు గాక!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః!

## విశ్వప్రార్థన

హే కరుణా ప్రేమ మయ, ఆరాధ్య భగవానుడా! నీకు వందనములు సాష్టాంగ ప్రణామములు. నీవు సర్వస్థితుడవు (సర్వవ్యాపివి), సర్వ శక్తిమంతుడవు, సర్వజ్ఞుడవు. నీవు సచ్చిదానందమవు నీవుసమస్త ప్రాణుల అంతర్వాసివి. అంతర్యామివి అవగాహన (ఒకరి నొకరర్థము చేసికొను) హృదయము, సమదృష్టి, సరితూగు మనస్సు (balanced mind), శ్రద్ధ, భక్తి, జ్ఞానముల మాకు ప్రసాదింపుము. అధార్మిక ప్రేరణల నెదుర్కొనుటకు, మనసును వశపర్చుకొనుటకు నాంతరణి కాధ్యాత్మిక బలమును మాకు ప్రసాదింపుము. మమ్ముల నహంకారము, కామము, లోభము, ద్వేషము (యింకను నిట్టి యాసురిక యవగుణముల) నుండి విడుదల చేయుము. మా హృదయమును దివ్య సుగుణముల (దైవిక) సంపత్తితో నింపుము. ఈ సమస్తనామ రూపములలో మేము నిన్ను చూడనిమ్ము ఈ సమస్త నామ రూపములలో మేము నిన్ను సేవింపనిమ్ము. మేము సదా నిన్ను స్మరింప నిమ్ము. మేము సదా నీ వైభవముల కీర్తింపనిమ్ము. మా పెదవులపై నీ నామము సదా యుండనిమ్ము. మేము సదా, యెల్ల కాలము నీలో వసింపనిమ్ము.

సూచన: ఇది మంత్ర తుల్యము, కాదు, వాస్తవిక మంత్రమే. భవవానునికి పవిత్ర హృదయము, పవిత్ర భావము, పవిత్ర భక్తియే ప్రధానముగాని భాషకాదు. ఆశ్రమమున (శివానంద) లేచినది మొదలు నిద్రించు వరకు, బ్రహ్మ ముహూర్త సత్సంగము లగాయతు నడిరాత్రి సత్సంగము వరకు నాంగ్లమున శ్రీ సద్గురు భగవానులచే రచింప బడిన విశ్వప్రార్థనను (Universal Prayer) సర్వులు శ్రీ గురుదేవులతో సహా పఠింతురు. ఇది సర్వ మతసారము, సర్వ

శాస్త్రసారము, సర్వ మహాత్ముల ఉపదేశ సారము, సర్వ సాధనలయొక్క అంతిమలక్ష్యము. ఇందలి ప్రతి ముక్కను, ప్రతి పదమును, ప్రతి వాక్యమును సరిగ్గా, సమగ్రముగ గ్రహించి నిత్యానుష్ఠాన మొనర్చుచో మోక్షము కరతలామలక మనుటకు సందియములేదు.

ఈ విషయమును గుర్తించి సర్వులు సత్సంగ సమయముల, ప్రత్యేక ప్రార్థనా వేళలపై "విశ్వప్రార్థన"ను పఠించి, యనుష్ఠించి దివ్యజ్యోతిని దర్శింతురుగాక !

హరిః ఓమ్ తత్సత్ !

ఓం శాంతీ శ్శాంతి శ్శాంతిః !

---

# ఆంధ్ర ప్రదేశ లక్ష్మి

'కవిచంద్రులు' శ్రీ కోట సోదరకవులు

రావే! ఊర్వశి, రావె రంభ త్వరగా రా! వేగమే! మేనకా!
రావే! శీఘ్రముగా తిలోత్తమ! వడిఁ రారమ్మ! ఘృతాచి యం
చా విద్యుత్పథసీమ, నొండొరుల నాహ్వానించుకొన్నారలాం
ధ్రీవైభోగ మహోత్సవక్రమము దర్శింపంగ దివ్యాంగనల్-
గాత మీకృష్ణ వేణీతుంగభద్రాపి - నాకినీజలపావనైకభూమి,
క్షామ పిశాచ లాస్యమ్ము మాయింపఁగా-బంగారు పండించు పంటపొలఁతి,
'అమరావతీ' స్తూపమాది యాశిల్ప-చిత్రము లొప్పారు సౌందర్యసీమ
పతిత రక్షణ తిరుపతి భద్రగిర్యాది-క్షేత్రమ్ము లలరు పవిత్ర చరిత,
వనెదు, చారిత్రక యథార్థతనుఁ జెలఁగి-నిత్యనూతన జాతీయ నిరుపమాన
భోగభాగ్యాలు దినవృద్ధిఁ బొందునట్లు-తేజరిల్లుమమ్మ! ఆంధ్ర ప్రదేశలక్ష్మి
ప్రమోదులు చిగిరించి మురియఁగాఁ జేసిన-తెనుఁగు పాటకుల తియ్యని స్వరమ్ము,
శిలల రూపముఁ జెక్కి, జీవముల్ పోసిన-తెలుఁగు శిల్పుల పోగరల బెడంగు,
జీవకళలు తీర్చి చిత్రించిన తెనుంగు-చిత్రకారుల హస్తశిక్షణమ్ము,
అరులఁ జెండాడి నెత్తురు పీల్చి యొప్పిన-తెనుఁగు వీరుల ఖడ్గసునిశితమ్ము,
దేశదేశాల కీర్తి ప్రదీప్తి నింపి-మన్ననలుఁ గాంచెనమ్మ! యేమన్నఁగాని,
పొరుగురాష్ట్రల మునిపండ్లు పులియునట్లు-తేజరిల్లుమమ్మ! 'ఆంధ్రప్రదేశలక్ష్మి'
నరరూప విద్యాబ్ధి 'నాగార్జునుఁడు' బౌద్ధ-వాఙ్మయమందు మేల్బంతియయ్యె,
రాగసుధాంబుధి 'త్యాగయ్య' దేశీయ-గాయకు లందగ్రగణ్యుఁడయ్యె;
'కోహినూరు' వజ్రమ్ము మహిఁగల్గు జాతిర-త్నాలలో నగ్రతాంబూల మందె,
రాష్ట్రసంసిద్ధికై ప్రాణమర్పణఁ జేసి-'శ్రీరామయోగి' జేజేలఁ జేరె,
నాఁడుపొందిన విభవ మీనాఁడుగూడ-ననుభవించెదవమ్మ! సత్యమ్ము తల్లి!
కంటిరెప్పలచాటు నీకన్నసుతులఁ-దీసికొనుమమ్మ! 'ఆంధ్ర ప్రదేశలక్ష్మి!'

(609-వ పేజి చూడుడు)

# నాగరికత

శ్రీమతి H. కనకలక్ష్మమ్మ

నాగరికతయననేమో నేటి మనకు తెలియుననుకొనుచున్నాముగాని నిజమునకు నాగరికతయన తెలియనే తెలియదు. కొందరనుకొను నాగరికతయనగా శ్వేతముఖుల ననుకరించుట యనుకొనుచుందురు. క్రాపులని జుత్తును కత్తిరించుకొనుటయు, ఫేసు పౌడర్లు నలందుకొనుటయు, హేండుబేగులు చేతబట్టుకొని తిరుగుట యనుకొనుచున్నారు. మరియు విద్యావతులయి స్వాతంత్ర్యమును సంపాదించుకొంటి మనుకొందురు. ఎంతయినను స్త్రీ స్త్రీయే. కనిపించు బాధ్యతలు తప్పవు. మరియు భర్త తనపై నధికారముచేయ వెఱచును. ఆమె సద్గుణవతి యగుచో సంతోషమే. కాని గర్వముకలదైన ఆమెకేకాక ఆమె నాశ్రయించి యున్నవారెల్లరకును శాంతి యనునదుండదు. భర్త రాజువంటివాడు. అనగా తన గృహరాజ్యమునందు ఏయొక్కరుగాని ముఖము ముడుచుకొనకుండ, సర్వులను చక్కదిద్దుకొనవలసినవాడు. ఎట్టులైనను పురుషునకుండు, సత్వగుణము స్త్రీకుండుటరుదు. సద్విద్యనేర్చినచో సత్వగుణవంతురాలగును. అదియే పతిభక్తి.

పతివ్రతయొక్క తన పతి యోగక్షేమములనేగాక తన అత్తమామల నాడుబిడ్డల, బంధువుల, బిడ్డల కడకు సేవకుల విషయమునగూడ దయనుగలిగి ప్రవర్తించును. యిదియే నాగరికత. పతియాజ్ఞానువర్తిని సర్వశక్తి సంపన్నురాలగును. మరియు, పతి యెంతటి దుర్మార్గుడైనను సతి తన పతిని తన సహనశక్తిచే సరిదిద్దుకొనగలుగుచున్నది. అంతియేగాని వీరు వారలను బిలువదు. ఆత్మహత్యచేసికొనదు.

---

(608-వ పేజి తరువాయి)

పలుకుఁ బూఁదేనె జిప్పిలకై తలల్లిన-మొల్ల నీ కీర్తికి మూలమయ్యె,
పగవారి ప్రక్కలో బల్లెమై యొప్పిన-'రుద్రాంబ' నీశక్తి రూపిపఱచె,
ఆకొన్నవారి కాహారమ్ము కూర్చిన-'సీతమ్మ' నీ యీవిసిరి వచించె,
వీరగంధముపూసి పోరికంపిన మగువ-'మాంచాల' నీ కీర్తి మలపెదిశల;

సరససాహిత్య శౌర్యసౌజన్య దాన-మహిమముల కీవు మణి భర్మగృహముతల్లి!
లేదు నీచేతి కైజారు వాదర్శకిఁక-తిరుగు లేదమ్మ! 'ఆంధ్ర ప్రదేశలక్ష్మి!'

తన నిండు ప్రాణమును హత్యజేసికొనుట తమోగుణ లక్షణము. ఇట్టి తమస్సును భక్తియను దివ్యోపాయమున పోగొట్టుకొన వలయును. ముందు స్త్రీ తన విధ్యుక్త మేమియని విచారించుకొనవలయును. తాను నొవ్వక, తనవారు నొవ్వకయుండు మార్గ మేదియో, ఆలోచించి యెదురులను దూషింపక నిదానమును గల్గియుండవలెను.

ఒక స్త్రీమూర్తియన ఎంతటి విలువగల బాధ్యతలుగల్గి జన్మించుచున్నదో తెలిసికొనలేకున్నాము. స్త్రీ శక్తి స్వరూపిణి. మరి పదిమార్లు తాను శక్తి స్వరూపిణినని వల్లించుటగాదు. సంసారసాగరమునగల్గు తుపానులను యొడిదుడుకులను భరాయించవలెను. ఆగృహమునకు తాను చుక్కాణివంటిదామె. ఆ చుక్కాని సరిగ నుండవలయును. అంతియేగాని క్షణిక దుఃఖములకు వెఱచి భయభీతియై బుడుంగున నీట మునుంగు యువతియు నొక శక్తి స్వరూపిణియా? నగుబాటుచేటు. అట్లనుకొనిన పంచపాండవులు భర్తలుగాగల మహాసాధ్వి ద్రౌపది, యరణ్యవాసమును వారలతో యోర్చికొని నెఱపలేదా?

ఇందరుండియు నాకింతటి కష్టములా గల్గుటయని విరక్తితో యాత్మహత్య జేసికొనలేదు. మరి సీతామాత, రాముని ననుసరించి అరణ్యవాసమును జేసినదిగాని, సవతియుత్తనుదిట్టి యురిపోసుకొనలేదు. అర్ధాయువును జేసికొని పతిహీనయైన సావిత్రి యడలి ప్రాణత్యాగము చేసికొనలేదు. తనపతి భక్తియనుశక్తి సహాయమున యముని మెప్పించి యముని జయించెను. శక్తి స్వరూపిణియనగా నామెయే! భళ! భళీ! యిట్లుండవలయును నారీ విద్య!

పతిభక్తిలేనిశక్తి శక్తికాదు. దానిని ఆవేశమనవచ్చును. అహంకారశక్తియనవచ్చును. ఇంకనూ యెన్నెని దుష్టశక్తులుండవచ్చును. కాని వలయునది, సద్భక్తిశక్తి. చంద్రమతి అలోకసామాన్యమగు కష్టముల కోర్చినది కావుననే, జగత్పితలగు, పార్వతీ పరమశివులను దర్శింపజేసినది. ఇహపరముల రెండును యొనగూర్చినది. కాని దుఃఖపరంపరలకు భీతిల్లి ప్రాణమును నష్టముజేసిగొనలేదు. మతిని పోగొట్టుకొనలేదు.

స్వార్థమావంతయులేని నిస్సంగులగు మహాసాధ్వులు, యముని జయించగలరని పైన జదివితిరిగదా? అన్నిటికిని మూల కారణము తన సుఖమునుగూర్చి తలపోయుటయే దుఃఖమునకు కారణము. తన కనియు తన సుఖమనియు నెంచక, గంగగోవు యేరీతి తన పాలను యితరులు పితుకుకొనిపోయినను, మారాడక, కడకు

తన బిడ్డకు పుడిసెడుపాలు లేకపోయినను, నిశ్చింతురాలై, శాంతముగల్గి యెప్పటివలె చూపరులకు ప్రియమును గూర్చుచున్నదో, తెలిసిన విషయమే. శక్తియొక్క శక్తి రాపిడివలనగాని బయటబడజాలదు. ఎట్లన నగా - శక్తికిపై శక్తియే ఓరిమి. ఓరిమియే నిజశక్తి. అంతియేగాని గంగానమ్మ, నూకాలమ్మ పూనకములు గాదు.

ఇంద్రియ నిగ్రహశక్తికి మించిన శక్తి యేలోకమున నున్నది? అట్టి యింద్రియ నిగ్రహశాలి, స్త్రీ కావచ్చును, పురుషుడు కావచ్చును యిరువురును శక్తులే! శరీర మాత్రమున పురుషులు పురుషులు కారు; స్త్రీలు శక్తులుగారు.

ఇప్పుడు ఒక్క చక్కని కథను స్మరింతము:

పూర్వకాలమున నొకానొక మహనీయుడుండెను. ఆతనికొక చక్కని కుమార్తెగలిగెను. ఆమెజన్మమపూర్వము- అనగా ఆమె తులసి వనమందు పుట్టెనట. మరియు యామె తండ్రి పెరియాళు యని నామధేయము గలవాడు. ఆయన విష్ణు భక్తుడు. తులసి మాలల గ్రుచ్చి, నిత్యమును తన యిష్ట దైవమగు రంగనాథుని సేవకంపుచుండును. ఒకనాడు తులసీ వనమందు చిన్న బాలికను జూచి ముదమార దెచ్చి, పెంచుకొనుచుండెను. శుక్లపక్ష చందురునివలె దినదిన ప్రవర్థమానయై నిండు యౌవ్వన మంకురింప కన్నులపండువట్లు పెరుగుచుండెను. ఆమె విష్ణు భక్తురాలు. రంగనాథునియందు యనన్యమగు భక్తి గలిగి యాతని గానము చేయుచుండెను. పుష్ప హారముల నేర్పుమెయి గట్టి తండ్రి కిచ్చుచుండును. అపుడామె యా హారమును ధరించి యద్దమున తన యందము జూచికొని తదుపరి శ్రీరంగని సేవ కనుపుచుండెను. యిట్లు నిత్యమును జరుగుచుండెను. ఒక దినమున యా హారమందు యామె తల వెంట్రుక యొకటి యుండుట జూచి యర్చకుడు పెరియాళును పిలిచి యిది యేమని యడిగెను. ఆతడు గడ గడ వడకుచు తన తనయ తప్పిదమును గ్రహించి, చిన్నబుచ్చుకొని, యిల్లు జేరి, తనయపై నాగ్రహించి యిట్టి కార్యమును జేయవచ్చునా యని మందలించెను. అందుపై యామె తానట్లు చేయుట మానినదై, నిత్యమును మాలనుగూర్చి యిచ్చుచుండెను. ఆ దినమున రంగనిమెడ నున్న మాల క్రిందపడి యుండెను. అందులకు కారణ మెరుంగజాలక అర్చకుడు బాధపడుచుండెను. నాటిరేయి ఆ యర్చకుని కలలో శ్రీస్వామివారు కానంబడి, నా భక్తురాలు ఆండాళు ప్రీతితో తాను ధరించి యటుపై నా కలంకరించు మాలయే నాకు పరమ ప్రీతిదాయకము.

కాని యామె ధరించని యీ మాలా సౌందర్యము నాకు వలదని నొక్కి పలికె నట. అర్చకు డా సంగతిని వేకువనే పెరియాళునకు దెలిపెను. పెరియాళు కుమార్తె యొక్క భక్తికి మెచ్చి, "అమ్మా! నీవు నిత్యమును అలంకరించుకొను నట్లే నిత్యమును యలంకరించుకొని నటుపై స్వామి వారికిమ్ము తల్లీ!" యని చెప్పెను. ఆమెయు ముదంబంది, తనయందు స్వామికిగల ప్రేమ కమితానందమొంది యానందమయ జీవితమును సాగించుచుండెను. ఆమె స్వామిని దప్ప తదితరుని పరిణయ మాడనని ప్రతిన బూనెను. ఆమె మనోవాక్కాయముల స్వామినే ప్రేమించెను. మనసులో సదా అతని యందు భక్తిరసమే యొలుకుచుండును. వాక్కున నాతని నామమే యుచ్చరించు చుండెను. చదివిన యాతని దివ్య విభూతులే చదువు చుండెను. అహోరాత్రము లాతని దివ్యచరణారవింద ధ్యానము దప్ప, తదితరము నొల్లదు. యీామె తన నాథు నందు గల యఖండ భక్తిశక్తి వలన జ్ఞానమును బొంది, జీవాత్మ పరమాత్ముల భేధమును దెలిసి సకల చరాచర జగత్తు నందు, తన నాథుడే నిండియున్నాడని దెలిసి, ఆతని విశ్వరూపుడై భావించి, ఘోరారణ్యమున మహా తపస్సు చేసినను సిద్ధించని పరమ జ్ఞానానందమును బడసెను. ఇదియంతయు పతిభక్తి ఫలితము. అపుడు తాను జ్ఞానమును బొందినది కావున - పురుషుడగు పరమ పురుషుని రూపమును బొందినదై, సాయుజ్య, సామీప్య, సారూప్య సాలోక్యముల బొందినదిగాన, గొల్లపడంతుకల జేరబిలచి, వారలకు బోధలంగావించి, తానే గోప గోపికా వేషధారి యయ్యెను; నిజ కృష్ణుని లీల లాడిన దాయెను.

ఆ గొల్ల పడంతుకలు గోపికలట్లు ఆనందించిరి. నిత్యమును మార్గశిర మాసమున నొకరినొకరు పిలచుకొనుచు, ఆండాళను కృష్ణమ్మను పిలచికొనిపోయి తెల్లవారు జామున జలక్రీడల సలిపెడువారు. అట్టి సమయములందు అది నిజముగ యమునా తీరమే యగుచుండెను.

కృష్ణ నామాంకితమగు భక్త హృదయ మున్నచోట, బృందావనముగాక వేరే మగును? యిట్లు తన చెలికత్తెలగూడి యీా ముద్దయాలు, గోప గోపికే వేషధారియై, కృష్ణలీలల నాడినదాయెను. తన చెలులను స్నానమునకు పిలచుటయును, జ్ఞానమునుగూర్చి వారలకు బోధించు సందర్భములును 'తిరుప్పావు' యను మహా వైష్ణవుల గ్రంథమునందున్నది.

ఆ తిరుప్పావు మహా గ్రంథమును రచించిన దామెయే. అందు భక్తికి పెట్టినది పేరు. మరి భక్తురాలు రచించిన కీర్తన మెట్టు

వలెనుండును. కండ చక్కెరను బోలు యీమె వచనములు విన్నవారు తరించక మానరు. జ్ఞానమునకు ఆమె పెట్టినదిపేరు. ఇట్టి భక్తి జ్ఞానములు రెండును గలవారు యరుదు. భక్తి జ్ఞానములు రెండును గల హృదయపు వెలుగు, కోటి సూర్య ప్రకాశ మానమనిన, యతిశయోక్తికా నేరదు. ఆమె జ్ఞాని! కావుననే పురుషోత్తముని లీలలాడినది. ఇట్టి బ్రహ్మ విద్యకు మించిన విద్య గలదే ముల్లోకములు తరచినన్?

ఆమె తన ప్రాణ లీలను యనంతముగ యాతనియందు లీనము గావించెను. అనగా సాయుజ్య ముక్తిని బొందెను. ఆమె ప్రకృతి స్వరూపిణి. జీవాత్మ జ్ఞానమును బడసి, పరమాత్మని యందనన్యముగ గలసిపోయెను. యిదియే నాగరికత!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

(615 పేజీ తరువాయి)

## రాబడిలో వ్యత్యాసాల నిర్మూలనానికి కృషి

కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళికలో చేర్చతగు అంశాలలో రాబడిలో వ్యత్యాసాల నిర్మూలనానికి కృషి ఒకటిగా ఆలిండియా కాంగ్రెస్ సబ్ కమిటీ సూచించింది.

ఎన్నికల ప్రణాళికలను రూపొందించడములో అవి ఆకర్షణీయంగా మాత్రము తయారుకావడం చాలదు. ప్రణాళికలను చూచి ప్రజలు భ్రమించి ఏదో పార్టీని అధికారములోకి తెచ్చి ప్రణాళికాంశములు అమలులోనికి రాకపోయేసరికి ప్రజల ఆదరాభిమానములకు దూరమయ్యే పార్టీభవిష్యత్తు పతనానికి దారి తీస్తుంది.

ఎన్నికల ప్రణాళికలో ఉన్న అవకాశములను పారజూచుకొని, ప్రజావసరాలను గుర్తించి రెంటిని సమన్వయపరచి తాము చేయకలమనుకొనిన దానిని ప్రజలకు వాగ్దానంచేయాలి. అధికారములోనికి వస్తే ఆ పార్టీ తమ ఎన్నికల ప్రణాళికలోని వాగ్దానములను నెరవేర్చాలి. ఇంతవరకు కాంగ్రెస్ వాదులు తమ వాగ్దానాలను చెల్లించలేక పోయారనేది దేశ వ్యాప్తంగా నొక అపవాదు.

రాబడిలో వ్యత్యాసాల నిర్మూలనానికి కృషి ఎలాగ జరుగుతుందో చూడవలసియున్నది.

వ్యవసాయ, వర్తకవ్యాపారరంగాలలో ఎక్కువ విస్తీర్ణపు పొలమున్న వానికి తక్కువ యున్న వానికంటె ఆదాయం అధికముగానే యుండగలదు. కొద్ది, గొప్ప పెట్టుబడితో వర్తకవ్యాపారముల నిర్వహించే వారి ఆదాయం లక్షలు, కోట్లు రూపాయల పెట్టుబడితో నిర్వహించేవారికంటె ముమ్మాటికి తక్కువగానే యుండగలదు. అలాగే కాయకష్టం చేసేవారికికూడ ఎక్కువపని, ఎక్కువ కాలంచేసే వారికంటె తక్కువకాలం తక్కువపని చేసేవారికి ఆదాయం తక్కువగనే యుండగలదు. ఇక ఉద్యోగ సద్యోగాలలో సయితం డిగ్రీలననుసరించి, అనుభవముననుసరించి, హోదాలననుసరించి ఆదాయాలలో తరతమ భేధాలున్నవి. దీనిని నిర్మూలించాలంటే రావాల్సినమార్పు విప్లవాత్మకమైనది కావాలి

వ్యవసాయం, వర్తకవ్యాపారాలు, పరిశ్రమలు జాతీయమై ప్రజావసరాలను ప్రభుత్వమే గుర్తించి తీర్చడం జరిగితేగాని ఆదాయవ్యత్యాసాల ప్రసక్తి మానిపోదు.

అయినా ప్రజల వ్యక్తిత్వానికి, ఆత్మగౌరవానికి లోటులేకుండా వారి అవసరాలుగడిచి సౌభాగ్యవంతముగా నుండగలుగునప్పుడు ఆదాయపు ప్రసక్తికూడ అనవసరమేమో!

ప్రజలు తమ దేశంపట్ల భక్తి విశ్వాసములతో బాధ్యతలను తాము నిర్వహిస్తూ నిత్యావసరాలకు లోటులేకుండా జీవయాత్ర సాగించే రోజులు రానున్నచో కాంగ్రెస్ సంస్థకూ ఎన్నికల ప్రణాళికకు ప్రజలు కలకాలము జోహారు లర్పించగలరు.




ప్రజలు :-ప్రభుత్వము : అనువాదం : శ్రీ జానపాటి సత్యనారాయణ. ప్రచురణ కర్తలు : దేశోద్ధారక గ్రంథమాల, నారాయణగుడ, హైదరాబాదు. వెల సభ్యులకు రు. 1-1-6, ఇతరులకు రు. 1-4-0

కౌంట్ లియోటాల్‌స్టాయి రచించిన మూలమున కనువాదము. టాల్‌స్టాయి రచనలు మానవునికి వాస్తవిక తను కండ్లకుకట్టి తమ పరిస్థితులను చక్కబెట్టుకోడానికి, తమ సమస్యలను పరిష్కరించుకోడానికి ప్రబోధిస్తుంటవి. దాని ఫలితంగా మానవకోటికి ఆత్మబలం చేకూరి నిస్పృహ, నిరాశలు మరుగుపడిపోయి అభ్యుదయ కాముకులు కావడానికి ఆయన రచనలు ఆనాడు, యీనాడు అనే విచక్షణ లేకుండా దోహదం చేస్తూయుంటవి.

ఇందులో రష్యాలోని విప్లవానికి మునుపటి పరిస్థితులను, ప్రజల దుర్భర జీవితాన్ని వివరిస్తూ ప్రజలకు ప్రభుత్వమునకు సంబంధించిన దేశభక్తి, సాంఘిక సంస్కర్తలకొక విజ్ఞప్తి, అరాజకము, గాంధీ - టాల్‌స్టాయి లేఖలుగల శీర్షిక లున్నవి. రచనతోబాటు సమర్థనీయంగా జరిగిన అనువాదం పాఠకుల మన్ననల్కై నందుకో గలదు.

'భూదానము' ప్రథమ సంచిక మా కార్యాలయమునకు చేరినది. సంపాదకులు శ్రీ ఆర్. కె. రామలింగా రెడ్డిగారు.

ఆర్థిక అసమానత్వాన్ని సంఘంలో తొలగించడానికి ఉద్దేశించిన భూదాన యజ్ఞం యొక్క ప్రభావం అమోఘమైనదని చెప్పాలి. క్రమంగా భూదాన ఉద్యమము భూవసతి మనదేశంలో విస్తారంగా నుండీ కూడ, భూమిని నమ్ముకొని చాకిరిచేసికొని బ్రతుకుదామనుకునే వారికి భూవసతిలేని పరిస్థితులలో వేలు, వందలు యకరాల భూవసతిగల భూస్వాములు లేనివారి జీవనానికని కొంత త్యాగంచేయ ప్రబోధిస్తుందీ యుద్యమం.

ఇట్టి ఉద్యమ ప్రచారము కొరకు ఏర్పడిన పత్రిక గాంధీజీ ఆశయ లక్ష్యాలను, సర్వోదయ సిద్ధాంతాలను ప్రచారమునకు ప్రారంభించబడటం ప్రజలకెంతైనా ఉపయుక్తము.

సంవత్సర చందా రు. 3-0-0 విడిపత్రిక 0-2-0 కార్యాలయము : గాంధీ భవన్, హైదరాబాదు-1.



# సంపాదకీయములు

## భారత మహిళల బాధ్యతలు

దేశం సౌభాగ్యవంతంకావాలి! ప్రజలు నిత్యజీవితావసరాలకు లోటులేకుండా విద్య, విజ్ఞానములతో ఆయురారోగ్యములతో వర్ధిల్లాలి! ఇందుకే యావద్భారత ప్రజానీకం పురోగాములై స్వీయ సౌభాగ్యాన్ని తీర్చిదిద్దుకోవాలి.

ఈ సందర్భమున నూతనంగా మహిళలకు శాసనరీత్యా ఏర్పడిన హక్కులు, అవకాశములు వారిని మరింత బాధ్యతాయుతులుగా చేయవలసియున్నవి. జాతీయ శ్రేయస్సు దృష్ట్యా ప్రతియొక్కరు తమ గురుతర బాధ్యతలను గుర్తించి కార్యరూపంలో పెట్టాలి.

పురుషులవైనా, స్త్రీలవైనా హక్కులు, అవకాశములు జాతీయ శ్రేయోపురోభివృద్ధులకు ఉమ్మడిగా వినియోగపడాలి.

స్త్రీలు పురుషులతోబాటు హక్కులు, అవకాశములనేకాకుండా బాధ్యతలను సయితం పంచుకోవాలి. స్త్రీలు బాధ్యతలను తమ శక్తి సామర్థ్యములను, బుద్ధి బలాన్ని అనుసరించి నిర్వహించవలసియున్నది.

జాతీయాదాయం పెంపుకేమి, విద్యా విజ్ఞానాల వ్యాప్తికేమి, ఆరోగ్య, వైద్యసదుపాయాల పెంపుకేమి, నిత్యకుటుంబావసరాల సేకరణ సందర్భమునసేమి, సంగీత, సాహిత్య, కళల ప్రోత్సాహానికేమి మహిళలు నిర్వహించవలసిన బాధ్యతలు అపారములు. అంతేకాక పురుషులు నిర్వహించే బాధ్యతలలో స్త్రీలు తోడునీడైయుండుటవలన ఉభయులకృషి, శక్తి సామర్థ్యాలు దేశముయొక్క సౌభాగ్యమునకు దోహదం కాగలవు.

## కాంగ్రెస్ – ప్రజలు

కాంగ్రెస్ సంస్థ ఏకైకజాతీయ సంస్థయై కేంద్రములోను, రాష్ట్రములలోను అధికారములో నున్నప్పటికీ కాంగ్రెస్ వాదులకు – ముఖ్యంగా అధికారములో నున్నవారికి ప్రజలతో సన్నిహిత సంబంధములేదనే భావము వ్యాప్తమయియున్నది. వాస్తవికత కనుగుణ్యంగా ప్రజల సమస్యల నర్థముచేసికొనుటకు, వానిని ప్రజాహితాన్నుద్దేశించి పరిష్కరించి ప్రజల అదరాభిమానములకు పాత్రులగుటకు కలకత్తాలో జరిగిన ఆలిండియా కాంగ్రెస్ కమిటీ సమావేశంలో ప్రతి కాంగ్రెస్ వాదీ 100 కుటుంబాలకు సేవచేయాలను హితవుతో రూపొందించిన పథకం ఎంతైనా ఉపకరించగలదు.

కాంగ్రెస్ సంస్థ జాతీయత కనుగుణ్యంగా ప్రజలకు నాయకత్వము వహించుటకు కాంగ్రెస్ వాదినని చెప్పుకునే ప్రతివ్యక్తి చిత్తశుద్ధిని, సేవాతత్పరతను, విశాల హృదయంతో ప్రజాహితముపట్ల ఆసక్తిని అలవరచుకోవాలి. అప్పుడేకాని జాతీయనాయకత్వము బలపడదు.

(613 పేజి చూడుడు)

# శ్రీ దుర్ముఖినామ సం॥ర కార్తిక, మార్గసిర మాసములు

| | | | |
|---|---|---|---|
| 1956 సం॥ నవంబరు నెల | 16 | శు | త్ర 16.39 అశ 49.21 |
| | 17 | శ | చతు 16.36 భ 50.9 త్యా 4.4 |
| | 18 | ఆ | ○ పౌ 15.19 కృ 49.43 వ్యాప పూర్ణిమ |
| | 19 | సో | కృపా 12.48 రో 48-5 త్యా 3-54 |
| | 20 | మం | విది 9.8 మృ 45.24 త్యా 3-50 |
| | 21 | బు | త 4-29 ఏవ్యం 54-45 ఆర్ద్రా 41-51 |
| | 22 | గు | పం 53.5 పున 37-41 |
| | 23 | శు | ష 46.41 పుష్య 33.10 త్యాజ్యాభావః |
| | 24 | శ | స 40-17 ఆశ్లే 28.33 |
| | 25 | ఆ | అ 34.10 మ 24-7 |
| | 26 | సో | న 28-34 పూఫ 20.9 రామేశ్వర దీపోత్సవము |
| | 27 | మం | ద 23.42 ఉఫ 16-51 త్యా 3-51 |
| | 28 | బు | ఏ 19-46 హ 14.29 త్యా 3.55 |
| | 29 | గు | ద్వా 16.57 చి 13.12 |
| | 30 | శు | త్ర 15-20 స్వా 13.3 |
| | 1 | శ | చతు 15.0 విశా 14.9 |
| | 2 | ఆ | ● అమా 15.55 అనూ 16.27 త్యా 4.14 సూర్య గ్రహణం |

## మార్గసిర మాసము

| | | | |
|---|---|---|---|
| 1956 సం॥ డిసెంబర్ నెల | 3 | సో | శు పా 17-58 జ్యే 19.51 |
| | 4 | మం | విది 21-4 మూ 24-14 శూన్య తిథి |
| | 5 | బు | త 4.59 పూషా 29.24 |
| | 6 | గు | చ 29-28 ఉషా 35.5 త్యా 4-24 |
| | 7 | శు | పం 34.18 శ్ర 41.5 త్యా 4.24 |
| | 8 | శ | ష 39-11 ధ 47.5 త్యాజ్యాభావః |
| | 9 | ఆ | స 43-47 శత 52.49 |
| | 10 | సో | అ 47.53 పూభా 58.3 త్యా 4-21 |
| | 11 | మం | న 51.13 ఉభా 60.10 |
| | 12 | బు | ద 53-34 ఉభా 2-15 |
| | 13 | గు | ఏ 54.46 రే 5.39 |
| | 14 | శు | ద్వా 54.42 అశ్వ 7-54 |
| | 15 | శ | త్ర 53.19 భ 8-59 ధనుర్మాసారంభం |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press.
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-8-0. అర్థసంవత్సరపు చందా రు. 2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి అరు అణాలు. చందాదారులు ఏ మాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లై కార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# భారతప్రశస్తి




స్త్రీల ఆరోగ్య భాగ్యానికి

# లోధ్ర

ఆరోగ్య సౌభాగ్యములకు
కేసరి రత్నత్రయము

## లోధ్ర

గర్భాశయ రోగ నివారిణి

ఈ ఔషధము ఉత్తమోత్తమము, నికరమయినదిగా యాభైఅయిదు సంవత్సరములుగా ప్రఖ్యాతిగాంచినది. స్త్రీల ప్రత్యేకమైన, ఋతుసంబంధమైన జబ్బులు, హిస్టీరియా, నిద్రలేమి, మలబద్ధకము. తలనొప్పి, వెన్నునొప్పి మొదలగు వాటికిది వరప్రసాదము.

## అమృత

రక్తశుద్ధి ద్రావకము

నిరుత్సాహుల నరములను బలపరచగల శ్రేష్టమయిన టానిక్. రక్తహీనత, అజీర్ణము మొదలగు జబ్బులయందిది నమ్మకముగ పనిచేయును.

## అరక

సర్వజ్వర నివారిణి

ఇది మలేరియా, ఇన్‌ఫ్లుయంజా మొదలగు జ్వరములను, జ్వరగడ్డలను కుదుర్చును.

పూర్తి వివరములకు:

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

తెలుగుజిల్లాలకు, ఒరిస్సాకు, నైజాముకు ఏజంట్లు:
శీతారాం జనరల్ స్టోర్సు, విజయవాడ, బరంపురం, సికిందరాబాద్.

Lodhra Press, Madras-14.